శ్రీ

# సాత్రాజితి ::

Garvabhangamu.

# :: గర్వభంగము

( [illegible] నాటకము. )



యే జెళ్ల
వెంకటసుబ్బయ్యా చౌదరి.

# సాత్రాజితీ గర్వభంగము

## అయిదంకముల నాటకము.

గ్రంథకర్త
యేజెళ్ల వెంకటసుబ్బయ్యచౌదరి
రుద్రివరము.

బెజవాడ:
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపబడియె.
1933



కాలికోప్రతి 1-0-0.
సాదాప్రతి 0-8-0.

# విజ్ఞాపన

పాఠకమహాశయులారా !

నే నీ సాత్రాజితీ గర్వభంగ మను పొత్తము నైదువత్సరముల క్రిందటనే రచనాభ్యాసమునకై రచించియుంటిని. కారణాంతరములచే నింతవరకు ప్రచురింప వీలుకలుగదయ్యెను. నామిత్రులు కొందఱీపుస్తకమును దిలకించి అచ్చువేయించవలసినదిగా పలుమారులు ప్రోత్సహించుచు వలయుధనము భరింతుమని వచించుటచే దీనిప్రచురింప గలకొంటిని. ఇదియే నాప్రథమప్రయత్నముగ రచింపఁబడిన నాటకముగుటచే ననేకలోటు లుండ వచ్చును. కావున మాచదువరు లిందలి దోషంబుల మన్నించి నాకవి తెలిపినయెడ ద్వితీయముద్రణమున సవరించుకొనగలను. ఇంకలికథ నందితిమ్మకవికృతంబగు పారిజాతాపహరణమునుండి గ్రహింపబడినయ్యు మార్పులు చేయబడినవి. నస్మద్గ్రంథముద్రణమునకు తగుప్రోత్సాహ మొసగిన ఆయుర్వేద పశువైద్యభూషణ డాక్టర్ యేజెళ్ల శ్రీరాములుచౌదరిగారికిని నా యితర మిత్రులకును కోరినవెంటనే ప్రింటు చేయించి యిప్పించిన ఆంధ్రగ్రంథాలయ ప్రెస్ మేనేజరుగారగు కర్లపాలెము కోదండరామయ్య పంతులుగారికిని వందనములు.

ఇట్లు,

గ్రంథకర్త.

# నా సహాయ మిత్ర బృందము

| | | | |
|---|---|---|---|
| మ. రా. శ్రీ | నాదెళ్ళ సూర్యనారాయణ చౌదరిగారు, | | రుద్రవరం |
| ,, | దేవభక్తుని లక్ష్మయ్య చౌదరి | ,, | గోళ్ళమూడి |
| ,, | బత్తిని వెంకట్రామయ్య చౌదరి | ,, | ,, |
| ,, | యీ భద్రయ్య చౌదరి | ,, | ,, |
| ,, | ఏజెళ్ళ శేషయ్య చౌదరి | ,, | రుద్రవరం |
| ,, | ఏజెళ్ల కొండయ్యచౌదరి | ,, | పాములపాడు |
| ,, | జవ్వాది రాధాకృష్ణయ్య చౌదరి | ,, | కొణతమాత్మకూరు |
| ,, | మేడా వెంకటప్పయ్య చౌదరి | ,, | ,, |
| ,, | యీ సూర్యనారాయణ చౌదరి | ,, | ,, |
| ,, | నల్లమల శివరామయ్య చౌదరి | ,, | ,, |
| ,, | పులిపాటి వెంకట్రామయ్య శ్రేష్ఠి | ,, | అన్నవరము |
| ,, | గూడపాటి పుల్లయ్య చౌదరి (తాలూకాబోర్డు మెంబరు) | ,, | ,, |
| ,, | కుందా అప్పయ్య శ్రేష్ఠి | ,, | దెందుకూరు |
| ,, | యిప్పల కోటారెడ్డి | ,, | జయంతి |
| ,, | కాజా రామయ్య శ్రేష్ఠి | ,, | ,, |
| ,, | ఏజెళ్ల చిన సుబ్బయ్య చౌదరి | ,, | రుద్రవరం |
| ,, | నజ్జా కృష్ణయ్య చౌదరి | ,, | ,, |
| ,, | కొంపల్లి రంగాచార్యులు (పోష్టుమాష్టరు) | ,, | మాగల్లు |
| ,, | దేవభక్తుని నాగభూషణరావుచౌదరి | ,, | సోమవరము |
| ,, | కొల్లిపర రామకోటయ్య | ,, | రుద్రవరం |
| ,, | యీ లింగయ్య | ,, | ,, |

# ఇందువచ్చు పాత్రలు.

## పురుషులు.

శ్రీకృష్ణుఁడు—కథానాయకుఁడు.

నారదుఁడు—దేవముని.

జయంతుఁడు—కృష్ణుని చెలికాఁడు.

ఇంద్రుఁడు—నాకాధిపతి.

బృహస్పతి—దేవగురువు.

గర్గాచార్యులు—యాదవులగురువు.

గంధర్వులు—నందనవనమున కావలి గాయువారలు.

## స్త్రీలు.

రుక్మిణి—కృష్ణుని పట్టమహిషి.

సత్యభామ—కథానాయకి శ్రీకృష్ణుని ప్రియభార్య.

జాంబవతి<br>మిత్రవింద } కృష్ణుని భార్యలు.

శచీదేవి—ఇంద్రుని దేవేరి.

కుటిల—సత్యభామ చెలికత్తె.



గ్రంథకర్త

మేడ్ల వెంకటసుబ్బయ్యావధాని.

ఓం

శ్రీ లక్ష్మీనరసింహాయ నమః

శ్రీ శారదాంబాయై నమః



# సాత్రాజతి గర్వభంగము

## నాంది



వాణీధవ! నీలలోహిత సుని
శీరాది గీర్వాణ మా
నీవారంబును గొల్వ లోకజనని
వీక్షించుచుఁ శేషశ
య్యాశ్లిష్టజనాశ్రయాంబుజ శుభ
వ్యాపారసంరంభియౌ
గోవిందుండిడుఁగాత క్షేమముల మీ
కున్ మాకు నెల్లప్పుడున్.





శ్రీ

# సాత్రాజితి గర్వభంగము.

## ప్రథమాంకము.

### 1 వ రంగము

(అమరావతీ ప్రాంతభూమి, పారిజాతపుష్పము కరంబునఁ దాల్చి గానము సేయుచు నారదుఁడు ప్రవేశించి గానముఁ జాలించి)

నా—ఓహో! భగవంతుని లీలాచరిత్రాస్వాదనాభిలాషను నేఁ బ్రకృతిన్నైతేమియు మఱచి తిరుగఁగా. అహా! అనుపమానీయుని సేవాపరతంత్రులగువారల కెల్లప్పుడు నానందమే సర్వకార్యసాధనమై యుండ నితరకార్యములందు మనసు చొరకుండుటాశ్చర్యమా! కావున నే భక్తప్రపాలనములనైనను మఱచి హృషీకేశనామ చింతనానందమున తిరుగుచుంటిని. (ఆగి) నేఁడీయమరావతిని దర్శించుట ఆ శచీబలశాసను లగౌరవంబుగాఁ బూజించినందులకేదియేని యొక కలహనాటకము ప్రారంభింపఁదలంచి ఈ పారిజాత పుష్పమునుఁ గొని తెచ్చితిని. కాని ఈపుష్పకారణమున నింద్రునకు గర్వభంగము కాఁగలదు. (ఆలోచించి) మంచి యుపాయము పొడగట్టినది. దీనివలన విచిత్రమైన నాటకము కాఁగలదు. ద్వారకానగరమున శ్రీకృష్ణభగవానుని దేవేరులలో సత్యభామ సౌందర్యవతి యనుగర్వంబున జగత్కారణుఁడగు శ్రీకృష్ణుని సామాన్యునివలెఁ జూచుచు రుక్మిణి మొదలయిన సపత్నుల గేలి సేయుచు శ్రీకృష్ణుఁడు తన నెయ్యుఁడు గారవించు వనియు నేవస్తువునైనఁ దనకుఁగాక యితరుల కీయఁడనియును మీఁదు

మిక్కిలి శ్రీకృష్ణుఁడు తనకు విధేయుఁడనియున్నుఁ దలంచుచు విఱ్ఱవీఁగుచున్నది. కావున నీపుష్పమును వాసుదేవునిచే రుక్మిణి కిప్పించినసత్యభామ తనకాపుష్పము వలయునని కృష్ణునిఁగోరును. సత్యకోరికపై శ్రీకృష్ణుఁడు పారిజాతాపహరణోద్యోగి యగుట నిక్కము. తన్మూలమున నింద్రోపేంద్రులకు వైర ముత్పత్తి లుట నిక్కము. ఇంద్రునకు గర్వభంగ మొనఁగూడుటయు సత్యము. అటుల కాదేని సాత్రాజితీగర్వభంగ మగుటయైనఁ బొసఁగును. ఏదియైనను నాయాకలి దీరుభాగ్యమే కలుగును. (నిమీలితనేత్రుఁడై) ఓ సృష్టిస్థితిలయకారణా! భక్తవత్సలా! నీభక్తుఁడనగు నాకోరిక నెరవేర్తువుగాక.

గీ॥ అరయఁగఁ బిపీలికం బాదియజునివఱకుఁ
గలుగుజీవాళి నీసేవఁ గాంచలేక
ముక్తి నందరు సుఖఫలంబులను జెంద
రట్లుకావున నాసేవనందుమయ్య.

ఇదే ద్వారకానగరమునకు నడచెదఁగాక.

(నిష్క్రమించును - తెరవ్రాలును)

---

2 వ రంగము.

(ద్వారకానగరోద్యానవనము- చలువఱాతిన్నెపై - రుక్మిణి, జాంబవతి, మిత్రవింద.)

జాంబ——అక్కగారూ! సత్యాదేవి యెట్టిపుణ్యము నోఁచి జనించెనో కాని ప్రాణేశ్వరుప్రేమసాగరంబున సంతతము విహరింపఁగలుగు భాగ్యమందినది. ఆమెయన్న నాథునకుఁ బంచప్రాణములు నుప్పొంగును. ఆమె యడిగినకోరిక నెంతటికష్టమైనను సాధించి సంతోషము కలిగించును. మొన్న నరకాసురవధనమునకు సైత మామెను వలదనక కొనిపోయెను. నిజముగా మనమే యెందులకుఁ గొఱగానిజన్మ మెత్తితిమి.

మిత్రి—నీ వెంతపిచ్చిదానవమ్మా! ఆ సత్యాదేవి యందచందముల ముందర మనయందము లెందులకు పనికివచ్చునని ప్రాణేశ్వరునకు మనయందుఁ బ్రీతి జనించును?

జాంబ—మనమాట యట్లుంచుము. అక్కగారికన్న నాసత్యాదేవి, యందగత్తెయా ?

మిత్రి— ఆయనకనల కామెయే యందగత్తె.

రుక్మి— జాంబవతీ మిత్రవిందలారా! నాథునకు మనయందుఁ బ్రేమ లేదని తలంచితిరా ?

జాంబ:మిత్రి—అవును.

రుక్మి— అటు లెన్నటికిని జరుగదు.

జాంబ—జరిగిన విషయమున కేమందువు ?

మిత్రి— జరుగుచున్నదాని కేమందువు ?

రుక్మి— అదియేదియో నాకుఁ దెలియుటలేదు.

జాంబ—నరకాసురయుద్ధమునకుఁ బట్టపుదేవివి నీ వుండగా వదలి ముద్దుల భార్యయని కాదా సత్యాదేవినిఁ గొనిపోవుట?

రుక్మి— మన మెవర మాకోరికఁ గోరితిమి?

మిత్ర— పోని, యిన్నిదినంబులనుండి మనగృహం బెటు లున్నదో చూత మనియైనరాగూడదా? దాని కేమి చెప్పెదవు?

రుక్మి— మెలఁతా! వినుము. ఒకపురుషునకుఁ బలువురుభార్య లుండిన నందరియిండ్లయందు నెట్లుండగలుగును.

మిత్ర—అటులైన నొప్పుకొనవలసినదే కాని సత్యభామామందిరమునసే బహుదినంబు లుండిన నెట్లు?

రుక్మి— మిత్రవిందా! ప్రాణేశ్వరుఁడు ఒకసాత్రాజితీ మందిరంబునసే యుండుటలేదు, సర్వప్రాణికోటిమందిరంబులందున నిండియే యున్నవాడు. పరికించి చూచినవారల కగుపడును. అలక్ష్య భావగర్వాంధకారులకు మాత్ర మగోచరుం డగును.

మిత్ర— నీవేదాంతమే నాథునకు మిక్కిలిచులకన మార్గమునుఁ జూపుచున్నది.

జాంబ— సత్యాదేవి హేళనఁ జేయుటకవకాశము కల్గించుచున్నది అక్కా! తోఁడిసవతి భర్తను వశవర్తిగాఁ జేసుకొని తానొక్కతెయే సుఖము లనుభవించుచుండ నీ కీయుదాసీనత యేదేసుమ్మా! మనముమాత్రము సత్యాదేవివలె భర్తృసౌఖ్యభాగ్యంబు లనుభవింపఁదగని వారమా?

రుక్మి— సఖియలారా! ఇంతమాత్రమునకే మన మామహనీయునకు నిందారోపణ మొనర్పఁదగదు. ఆమహనీయుని గుణగణంబులు వర్ణింప భక్తులకే సాధ్యముకాదు. మన మేపుణ్యవశమ ననో భార్యలమై జనించితిమదియే మనకుఁగల భర్తయందలిసౌఖ్యము. ఆపురాణపురుషుని సేవాభాగ్యంబు నాదరించుటకన్నఁదుచ్ఛములగు కామములకేమిచ్చ ఎకలదు? నాపలుకులు మీరు విశ్వసింపఁదలంచితిరయేని పరమేశుని సేవాభాగ్యమునే కోరుఁడు. భజింపుఁడు. భగవంతుఁడు భక్తులగువారికోరికల నెరవేర్చుట యందు సదాసంతోషచిత్తుఁడై యుండును. కావున మన మీ మిథ్యాసంసారబంధపాశముల నుండి విముక్తిఁగోరిన

సీ॥ పరమేశునిజకథా • భక్తితేజము లేక
సంసారతిమిరంబు • చక్కఁబడునె?
చక్రికథారసా • స్వాదచింతన లేక
భవరోగకూపంబుఁ • బాయనగునె?
కేశవనామసం • కీర్తనంబులు లేక
యీషణత్రయరాశు • లిరకఁబడునె?
వైకుంఠపాదసే • వాధర్మములు లేక
యైశ్వర్యసిద్ధుల • నందనగునె?
వలచి యచ్యుతుభక్తి భావంబు లేక
నిత్యసౌభాగ్యములను గాంచింపనగునె?

మనసు శోభింపఁగలదె కామంబుచేత
భక్తియనఁ ద్రోవ లేక యీభవముఁ బాయ.

జాంబ—అక్కా! నీవుచెప్పినది యథార్థము

మిత్రి—మేమును నీయిష్టము నే నడచెదము.

రుక్మి—మంచిది. అల్లదే ప్రాణేశ్వరుఁడు జయంతసహితుఁడై వచ్చుచున్నవాఁడు. ఎదురేగి నమస్కరింతమురండు (అందరు నిష్క్రమించి మరల ప్రవేశింప కృష్ణజయంతు లెదురుగా వత్తురు)

రుక్మి: జాంబ: మిత్రి—(నమస్కరింతురు)

కృష్ణ—కల్యాణులారా! మీ కందఱుఁ గుశలమా?

రుక్మి—జగత్క్షేమంకరులగు మీరు నాథులైయుండ మా కన్నిటఁ గుశలములే యొనఁగూడునుగదా.

జాంబ—సత్యము సెలవిచ్చితిరి.

కృష్ణ—ప్రాణేశ్వరీ! నాక్షేమము లే నాకుఁ దెలియనివాఁడనే మీకుఁ గుశలముల నెటులఁగూర్తును? ఇందులకు నేను కర్తనా?

రుక్మి—నాథా! నాహృదయమును బరీక్షింపఁదలంచి పలికితివి కాని సర్వకారణుండవై విశ్వగర్భుండవైన నీకెయ్యదిగోచరము కాకుండును? అంతట నీక్షేమమే ప్రాణుల క్షేమముగదా! అనుభవించువాఁడవును, అనుభవింపఁజేయువాఁడవును నీవుగదా. అద్దమునఁ బ్రతిబింబముఁ దిలకించుభంగి నీవే నీరూపమైన జీవులఁ బరికించుచుందువు.

జయం—ఇది మెచ్చఁదగినదే. నా కొకయనుభవము గలదు. నాభార్య నేనింటికి వెళ్లుటతోడనే నావైపున నూరక చూచుచుండ నేమని అడిగితిని. యది నేనే నీవు, నీవే నేను; నాసౌందర్యము నేను జూచుచుంటి నని బదులు చెప్పినది. నే నాలోచించి యాలోచించి వెనుకవైపునఁ జూడగా నిలువుటద్దమున్నది. అంతట సంతోషించి యూరకున్నాఁడను.

కృష్ణ—(నవ్వి) రుక్మిణీ! యిది నారూఢ మెట్లగును? నేను సామాన్యుఁడ గాని భగవంతుఁడ గాను.

రుక్మి—నాథా! యితరులవిషయము నట్లుంచుము. వేదములు, 'భగవత్స్వరూపమే భర్తయై కాంతలకు ముక్తి నొసంగు' ననుగదా! కావున సతీధర్మమున నిట్లు వచింపఁదగదా?

కృష్ణ—సతీశిరోమణీ! రుక్మిణీ! నేనంతటివాఁడ నైనను గాకపోయినను నీభక్తిమాత్రము సంతోషదాయకమైనది.

జయం—వయస్యా! యిటువంటి సాధ్వీలలామ యగు రుక్మిణీదేవిని విడిచి యారునెలలవఱకు సత్యభామామందిరముననేయుండవలయునా యేమి? ఇటులాడు నమ్రభాషణములు వినుచు వేయేండ్లు గూర్చుండినమాత్రము తనివితీరునటయ్యా?

రుక్మి—నాథా! భోజనవేళ యయినది, వెళ్లుదమా?

కృష్ణ— మంచిది జయంతా! రమ్ము. జాంబవతీ మిత్రవిందలారా! రండు
(అందరు నిష్క్రమింతురు- తెరవ్రాలును)

(ఆకాశవీథి, నారదుఁడు, గానముతో)

నార—ఓహో? కార్యసాధకులకుఁ దమవేగము తెలియదు గదా? చూచుచుండగ నింతలో ద్వారకాప్రాంతమున కరుదెంచితిని.

మ॥ అదె కాళింది తరంగ సంగత మహా♦హంసప్రభాజాల మ
ల్లదె బృందావనమధ్య సైకతవిశా♦లానందసంధాయి య
ల్లదె గోవర్ధనశైలనిర్ఝరతటా♦కాంభోజసంఘాత మ
ల్లదియే ద్వారక రాజసౌధశిఖరం♦బాలోకితం బయ్యెడిన్॥

వాసుదేవుఁ డిప్పుడెం దుండునో (ఆలోచించి) భళీ! నేననుకొనినటుల రుక్మిణీదేవి సౌధమందే యుండెను. ఇక నాకోరిక లొనగూడినట్లే (నిష్క్రమించును. తెరవ్రాలును)

---

### 3 వ రంగము.

(రుక్మిణీసౌధము)

(కృష్ణ జయంతులు- రుక్మిణీ జాంబవతీ మిత్రవిందలు)

జయం—వయస్యా! నరకాసురకదనమునకు నన్నుఁ గొనిపోయెద నని యెంతమాయ జేసితివయ్యా!

కృష్ణ—జయంతా! నీ వాయుద్ధమునే తిలకించిన ద్వారకానగరము మరచియుండువాఁడవే. దైవవశమున నీ కది సిద్ధించకపోవుటయే మేలు.

జయం—ఆహా! నే నంతపిఱికి ననుకొంటివా యేమి?

కృష్ణ—లేదు. నీనీడ నీవుఁ జూచుకొని భయపడు ధైర్యవంతుడవు. పిఱికికండ నీదేహమున నే లేదు.

జయం—భార్యనుఁజూచి బంధువుల మరచు నీవు న న్నగతాళి సేయుట తప్పా? అటువంటి యుద్ధము లేబది చూచినాను. దేవాసురయుద్ధమున నిందుర్రినకు సారథిని నేను.

రుక్మి—నీ వప్పు డెచట నుంటివి?

జయం—జగద్వ్యాపకుఁడనై యున్నాను.

అందఱు—(నవ్వుదురు)

జయం—మీరు న న్నేమి ఎగతాళిసేయుదురు లే. అదిగో, రాయబారము. సత్యాదేవిదాసి

(ప్రవేశము : కుటిల)

కుటి—దేవకీనందనా! జయము, రాజదేవేరులారా! నమస్కారము, బ్రాహ్మణశేఖరా! యంజలి.

జయం—అంజలి గింజలి నా నెత్తిమీఁద, బెట్టుకొననా నీశ్రాద్ధం మీఁద బెట్టుకొననా?

కుటి—(నివ్వెరగందును)

కృష్ణ—(నవ్వి) జయంతా! యేమి కావలయును?

జయ—ఏమి కావలయునా? నేనన నీ వెంత ఎగతాళి చేయుట మొదలు పెట్టితివో యీ ముష్టిదాసీము౦డకు గూడా పనికిరాక పోయితిని.

కృష్ణు—జయ౦తా! కుటిల ని న్నే౯ న త ప్పేమిగలదు?

జయ—అవును నీవు సాత్రాజితు ముగ్గురు భార్యయగు సత్యాదేవి దాసి పక్షము జెప్పక ఎ౦త చెలి కాడ నైనను నాపక్షము జెప్పెదవా?

రుక్మి—బ్రాహ్మణసర్వా! అట్లనుట వేల?

జయ—దేవీ! వి౦టివి కదా దీని ఎగతాళి; నే నన ని౦తచులకనయా? దీనిని నే నేమైన న౦టినా? దాసీము౦డలకు మా బ్రాహ్మణుల జోలి యె౦దుకు? మొత్తముమీాద సత్యాదేవి దాసి నిపి౦చు కున్నది.

కృష్ణు—జయ౦తా! నీ కేమైన చెము డున్నదా?

జయ—మహానుభావుడ వదికూడా నా నెత్తిమీాద బెట్టుము.

రుక్మి—లేనిమొడల కుటిల యు జలిపున గి౦జలి గని నేల ని టివి?

జయ—సరిసర నీవుకూడా వాని వైపున నే మాట్లాడదల౦చితివి. నిజమే అనుకొన్నప్పుడను కొన్నను సవతుల చుట్టరిక మెక్కడకు బోవును? ఎ౦దుకు పనికిరాని వాడను నేనే (ఏడ్చుచు)

కృష్ణు—ఓహో! నీ కెప్పు డేడ్పులే ప్రసన్నమగుచు౦డును నే.

జయ—నీ వేమన్నను నా యేడ్పులే నన్ను రక్షి౦పవలయును గాని యితరులు గారు.

కృష్ణు—పిచ్చివాడా! యూరకొనుము. ఎవ్వరైన విన్న నవ్వెదరు.

జయ—మీా ర౦దరు నవ్వి బోవనిము న్యాద ము౦కు పోవదులే.

కృష్ణు—(ఆలకి౦చి) అదుగో నారదముని౦ద్రు లేతె౦చుచున్నవారలు. (పిమ్మట నారదుడు ప్రవేశి౦ప అ౦దఱు లేచి నమస్కరి౦తురు) మునీ౦ద్రా! యీపీఠ మల౦కరి౦పుడు.

(నారదుడు కూర్చు౦డ న౦దఱును కూర్చు౦దురు)

నార—మహాత్మా! దేవకీన౦దనా!

గీ॥ హరుఁడు కమలగర్భుఁ డా పాకశాసనుఁ
డఖిలమునిగణంబు లాత్మ నెవని
పాదపద్మములకుఁ బ్రణతు లొనర్తురో
యట్టినీవు మ్రొక్క నగునె? యీశ!॥

కృష్ణ—వనజాసనాత్మజా! నాయందలి వాత్సల్యమున నట్లందురు గాక! మిముబోటిపెద్దల సేవింపనివారికి సుగతి లభించునా?

నార—నందనందనా! సామాన్యులజీవిత మటులే యగును.

కృష్ణ—నేనుమాత్రమేల సామాన్యుఁడను గాను?

నార—అవునా? నీలీలలు పురాణములై తేజరిల్లుచుండ నేల దాచెదవు?

సీ॥ మత్స్యరూపమున సోమకుఁ ద్రుంచి వేదముల్
సరసిజాసనున కొసంగె నెవఁడు
కూర్మమై మందరకుధరంబు పైకెత్తి
సురల కమృత మిచ్చి వఱలె నెవఁడు
క్రోడమై హేమనేత్రుని జంపి సర్వంస
హామండలము నిల్పి యలరె నెవఁడు
నరసింహుఁడై పుత్రు నిరసించు హేమక
శిపుఁ బరిమార్చిన శ్రేష్ఠుఁ డెవఁడు
బలినిఁ బాతాళసీమకుఁ బంచె నెవఁడు
దుష్టజనపాలమస్త్రముల్ ద్రుంచె నెవఁడు
మొనసి రావణుఁ గూల్చఁగా మూల మెవఁడు
అట్టి జగజెట్టి నీవె కాదా? రమేశ!

మఱియు,

గీ॥ గోపసతు లెల్లరును మానికోటి కాదె?
నీవు వైకుంఠుఁడవు కావె? యీ విదర్భ
రాజనందన యిందిరారమణి కాదె?
ఆదిశేషుండుగాడె? తాలాంకుఁ డనఘ!

రుక్మి—పరమాత్మునిదివ్యావతారలీలలు మీవలనఁగదా వినఁగల్గితిని.

జయ—వప్పురుచి బ్రాహ్మణునకుఁగాక యితరుల కెట్లుంగఁ దరమా?

కృష్ణు—సంయమివర్యా! తా మిప్పు డెచ్చటనుండి వచ్చితిరి? ఎచ్చట నేమి విశేషములు తిలకించితిరి.

నార—(తనలో) నాకై నేను చెప్పికొనవలసిన అవసరము లేకుండ గనే భగవంతుఁడు ప్రసన్నుఁ డగుచున్నాఁడు (ప్రకా) వాసు దేవా! నేను బహుదేశంబుల జూచివచ్చితిని,

శా॥ శ్రీకంఠుఁ భజియించి నీరజభవుఁ సేవించి మోదంబుగఁ
బాకారిం గని నందనోపవనసౌభాగ్యంబు వీక్షించి సు
శ్లోకప్రాభవపారిజాత మఁట నాలోకించి, వైకుంఠు భూ
లోకంబందున కేగి చూతమని నిల్లో నెంచి నిఁ గాంచితిఁ,

ఇదియే నందనవనపారిజాతపుష్పము (కృష్ణునకిచ్చును.)

కృష్ణు—సౌందర్యమునందు సౌరభవిశేషంబునందు పుష్పజాతులం దద్వితీయము.

రుక్మి—ఇట్టిది మన యుద్యానవనమం దెచ్చటను లేదు. ఆహా ఏమి ఈ పుష్పరామణీయకము !

నార—విదర్భరాజకుమారీ! రామణీయక మొక్కటియే కాదు. మహామహిమంబులును ఈ పుష్పమున విరాజిల్లుచున్నయవి.

రుక్మి—అవి యేవియో వినఁ గోరెదము.

నార—సావధానవై వినుము.

ఉ॥ ఎండకు నెండ దగ్గి నిడునేనియుఁగాలదు నీట నాన దు
ర్దండత ఱోటియందు నిడిదంచిన నజ్జువు కాదు తీక్ష్ణమా
యెండల శైత్యమిచ్చుఁ జలినిం గడు నుష్ణమొసంగు భాగ్యము
ల్గెం డగుఁ గోరెలొక్కటుణమే యొడి నిండు నిజంబు రుక్మిణీ.

సీ॥ ఈపుష్ప మే కాంతపాలివున నుండునో
యా కాంత కైశ్వర్య మలరు నెపుడు
నీ సూన మే నారియింట భాసిల్లునో
యానారి గౌరవమందు నెపుడు

నీ విరి నే లేమ ♦ యిష్టత దాల్చునో
యా లేమ సౌందర్య♦మంద్బు నెపుడు
నీ సుమమే యింతి♦దోసిట నలరునో
యా యింతి యాప్సితం♦బగును నెపుడు

యీ కుసుమ మహిమంబున ♦ నెట్టికోర్కె
లైన తానంతనొనగూడు ♦ నాత్మ నెంచి
భక్తిమై పూజనేయు నే ♦ పడతి కైన
భవ్యతరగాత్రి! భీష్మభూ♦పాలపుత్రి!

రుక్మి—ఆహా! ఇట్టి పుష్పము ధరించు శచీదేవి భాగ్యమే భాగ్యము గదా?

జాంబ—అక్కా! ఈ పుష్పము నీకుఁ దగినది సుమా.

మిత్రి—నిజము, ఈ పుష్పమున అక్కగారి పతివ్రతానిదానము జగము వ్యాపించినట్లు సౌందర్యమును ప్రాకఁగలదు.

జాంబ—ఆలాగా! మీ రట్లునిట్లు తెలుగనినారివలె వచించుచుండిన మాత్రమున నావయస్య్య డుప్పాంగి పుష్పమిచ్చునని తలంచి తిరా? ఏమి? కల్ల అది సత్యాదేవి భాగ్యమే.

మిత్రి—మేముమాత్రము భార్యలము గామా?

జయ—అయిన నేమిసంతోషము ప్రేమ యెక్కడ నుండునో వారిదే యనుభవము.

కృష్ణు—మునీంద్రా! బహునాయకీవల్లభుండనగు నే నెవరి కీపుష్ప మీయ బాడియగును?

జయ—ఒక్క భార్యగలవాఁడను నేనే. నా కాపుష్ప మిచ్చితివేని-(తల యూపును).

నార—కేశవా! బహునాయకీవల్లభుండవు మాత్రమేగాదు. విశ్వ భర్తవు. విశ్వమయుండవు. నీవెఱుంగని దెయ్యది గలదు? భక్తవత్సల బిరుదాంకితమునకు కళంక మాపాదింపకయుండ దలంచితివేని నీ కది గోచరమగుటలేదా?

జయ—అదిగో కుటిల చూచుచున్నది? ఏమే కుటిలా! నీ కిప్పింతునా?
(అందఱు నవ్వుదురు)

కుటి—విప్రవర్యా! మాదాసీలజోలి మీ కెందుకు.

జయ—లేదే. నోరూరుకొనక యడిగితిని.

కృష్ణ—(తనలో) నారదుని పలుకులు రుక్మిణి కీయవలయుననియే బోధించుచున్నవి. ఆమెయే భక్తశిఖామణి. భక్తులకోరిక నెరవేర్చుటకన్న నా కాసత్యభామ కాదు - ఏదియైనను ఇష్టము కాదు. (ప్రకాశము) రుక్మిణీ! ఇదిగో! పారిజాతపుష్పము. ధరించుకొనుము. (ఇచ్చును)

రుక్మి—(అందుకొని) మహాభాగ్యము. ప్రాణేశ్వరా! ధన్య నయితిని. ఏమి నాజన్మసుకృతము, పుణ్యసంపద.

చ॥ నిరతము స్వర్గసీమను సనింద్యమహామహిమంబుఁ గాంచి ని
ర్జరనగరోపకాననప్రసాధితకాగ సురేంద్రుజాయ తాఁ
గర మరుదారఁదాల్చెడి యగణ్యసుమంబగు పారిజాత మి
త్తఱి లభియించె నాదుసుకృతం బదియే మొ ముకుందుప్రేమచే

నార—తథాస్తు.

కృష్ణ—రమణీమణీ! అది యంతయు సురమునికి మన యందుఁగల వాత్సల్యవిశేషముకాని. నా ప్రేమ కారణముకాదు.

నార—మధుసూదనా! నీ ప్రేమయే లేకున్న నావాత్సల్యమెందులకుఁ బనికివచ్చును?

రుక్మి—మునీంద్రా! మీవాత్సల్యముననుఁ, నాథునికృపావలోకమునను నేను ధన్య నయితిని.

నార—నిక్కముగా ధన్యవయితివి. రమాసతీ! ఇఁక సర్వశ్రేయములు నీయిచ్ఛానువర్తనములు. నీ వనినఁ దిరస్కరించుచు నావలె సౌందర్యవతి లేదని విఱ్ఱవీగుచు నేవస్తువునైన గోపాలుఁడు తనకుఁగాక ఇతరుల కీయఁదలంపఁ డనియు గర్వమున మెలంగు సత్యభామ కిపుడు తప్పక గర్వభంగ మయినది.

జాంబ—మునీంద్రా! నిజముగా సత్యభామకు గర్వభంగ మయినట్లే.

మిత్ర—నేనును నొప్పుకొందును.

జయం—నే నంతకంటెముందే చెప్పెదను (కుటిలవైపుఁ జూచి) ఏమే కుటిలా! ఇదిగో, ఇదిగో! నామాటమాత్రము మీదేవి కెఱిఁగింపఁబోకుము. మీయాయన తిధి నూఱుకే పెట్టించెద

జాంబ—జయంతా! ఇదివరకే అవమానము నందినదాసి నేల హాస్యమునకు గుఱిసేతువు.

నార—సత్యాదేవికి గర్వభంగ మయిన దాసికిమాత్రమేల కాకుండును?

మిత్ర—పాపము! ఈవిషయము దెలిసిన సత్యభామ ఏమనఁగొనునో గదా.

జాంబ—ఏమనుకొని చేయున దేమున్నది

జయం—కాఁగలకార్యము గంధర్వులు దీర్చిరి.

కుటి—(తనలో) అకటా! ఏమి వీరియెగతాళి? కృష్ణుఁ డెంతమాయలాడు. అవసరము వచ్చినప్పు డన్నిటక్కులు వచించి నేఁ డిట్లు సత్యభామను గెలిసేయింపఁదగునే? కానిమ్ము. వీరిఎగతాళిని మాదేవి కెఱింగించి తగినశాస్తి జేయించెద.

జాంబ—కుటిలా! ఆలోచించెద వేమిటి?

జయం—అప్పుడే యేదియో పన్నుగడ నాలోచించుచున్నది. పాప మీకుటిలముఖ మెంతచిన్నబోయినదో. చూడుఁడు

కుటి—(తలవంచుకొని.) దేవీ! సెలవా?

రుక్మి—కుటిలా! సత్యాదేవి నడిగితినని వచింపుము

జాంబ—ప్రాణేశ్వరుని పారిజాతపుష్ప మిచ్చి పంపఁగలమని జెప్పుము.

జయం—జయంతుఁడు స్వస్తిజెప్పె ననుము.

మిత్ర—మిత్రవింద హారతు లిచ్చుననుము.

(కుటిల నిష్క్రమించును. తెరవ్రాలును.)

గద్య

ఇది శ్రీ వేదశైల లక్ష్మీనృసింహ కరుణాకటాక్ష వీక్షణ లబ్ధ కవితా మధురభాగధేయ సూరిజనవిధేయ యేజెళ్ల వేంకట సుబ్బయ నామధేయ ప్రణీతంబైన సాత్రాజితీ గర్వభంగమున ప్రథమాంకము.

---



శ్రీ

# సాత్రాజితీ గర్వభంగము.

## ద్వితీయాంకము.

### 1 వ రంగము

[సత్యభామ సౌధము · పాన్పుపై బరుండిన సత్యభామ]

కుటిల—(ప్రవేశించి) సత్యాదేవీ! లెమ్మా. లెమ్మా. నీకీగాఢనిద్రయెక్కడ దాపురించినదమ్మా.

సత్య—లేచి (కూర్చుండి) కుటిలా! ఇంత తొందరగా నిదుర లేపితివేలనే. ప్రాణేశ్వరుడు వచ్చుచున్నవాడాయేమి?

కుటిల—ప్రాణేశ్వరుఁడు లేదు మానేశ్వరుఁడు లేడు. ఇంక నీకా ప్రాణేశ్వరునిమీఁద మరులు పుట్టుచున్నవి గాబోలు.

సత్య—కుటిలా! అటు లనెదవేమి?

కుటిల—అనవలసిన దంటిని, తప్పా?

సత్య—ఏమిజరిగినది.

కుటిల—నీనాథునకు సత్యాదేవి మందిరమునుండి రుక్మిణీదేవి గృహమధ్యమువరకు కాలు జరిగినది.

సత్య—కుటిలా! నీ వనినది నాకేమియు స్ఫురించుట లేదు.

కుటిల—మొట్టమొదటనుండియు నామాటలే నీకు స్ఫురించిన యిట్టి గతియే పట్టదుగదా.

సత్య—(భయమున) కుటిలా! గతియా నాకు గతియా ఇదే మిట్టు లాడెదవు. కారణమేదియో వడిగా వచింపుము నామనము తందర జెందుచున్నది.

కుటి—అమ్మా! మీరు చెప్పినటుల రుక్మిణీదేవి మందిరమున కరుగునరికి తగవులజడదారియగు నారదముని యేతెంచెను.

సత్య—వచ్చి.

కుటిల—పారిజాతపుష్ప మను నొకదానిని దెచ్చి నీనాథున కిచ్చెను.

సత్య—అది నాకొరకై తెచ్చుటలేదా?

కుటిల—నీకా? పుష్పమా? అమ్మా! అంతటిభాగ్యము నీవు నోచి యుండినఁగదా.

సత్య—ఏమైనది.

కుటిల—రుక్మిణీదేవికి ప్రాప్తించినది.

సత్య—ప్రాణేశ్వరుఁడే యిచ్చెనా?

కుటి—ఇంకెవ రొసంగుదురు?

సత్య—నమ్మఁజాల. హాస్యమునకు నే నేమివచింతునో యని పలుకు చుంటివి. కాని ప్రాణేశ్వరుఁ డేమి, ముద్దులభార్య నగు నా కాపుష్పము నొసంగక రుక్మిణి కిచ్చుటేమి!

కుటి—దేవీ! నీ కెంత పిచ్చిప్రేమ యుండుటవలననే కృష్ణుని నమ్మి మోసపోవుచుంటివి. అది రుక్మిణి కిచ్చుట యన తృప్తి నొంద వలసినదే. కాని—

సత్య—సంశయింతు వేల?

కుటి—హృదయశకలాయత్తమగు నిందావాక్యములు సహింపఁదగి నవి కావు.

సత్య—(కోపముతో) నను నిందించిరా? ఎవరు?

కుటి—దేవీ! ఎవరైననేమి. గతించినదానికిఁ జింతించిన ఫలముండునా? మధ్య మీ భార్యాభర్తలకు కలహకర్తను నేను గావలసి వచ్చెను. ఏమో, నిమ్మళముమీఁద నీవే తెలుసుకొనఁ గలవుగదా.

సత్య—కుటిలా! ఇదివర కిట్టివిషయములు జెప్పక దాచుచుంటివా?

కుటి—అమ్మా! లేదు. నీకుగాక నాయాత్మబంధువు లింకొకరికి విన్నపింతునా.

సత్య—అటులయిన సంశయమేల?

కుటి—మీకుఁ గలహమేల కల్పింపవలయునని.

సత్య—ఎటులైనను దప్పునా? వివరింపుము.

కుటి—అట్లు నీనాథున కిచ్చినపుష్పమును నారదసంబోధనచే రుక్మిణీదేవి కిచ్చెను. అంతట నారదుఁడు రుక్మిణీదేవిని నుబ్బించుచు సత్యభామ కిఁక గర్వభంగ మగునని నుడువ, జయంతుఁ డవునన, జాంబవతీ మిత్రవిందలు నవ్వ, రుక్మిణీకృష్ణులు మౌనము ధరించిరి. దేవీ! వారి హేళనము వినుచుండిన నాకెంత చిన్నదనము గలిగినదని వచింపను. దుఃఖము పొంగి పొరలి వచ్చుచుండ వారి యెదుట నీకు మరింత యవమానము గలుగునని యోపుకొని నిలువలేక వచ్చుచుండ జాంబవతీ మిత్రవిందలు జయంతుఁడు నారదుఁడు ఎగతాళిమాటలాడిరి. దాసి యగు నాకే యట్టిమాటలవలన హృదయము పరిపరివిధములఁ బరుగెత్తినది నీవే స్వయముగా విన్నచో నెట్లుండఁగలదో?

సత్య—(కోపమున) కుటిలా! గోపాలుఁడు- వెన్నదొంగ- నిక్కముగా నన్నిటు లనిపించెనా?

కుటి—దేవీ! ఎన్నఁడైన మీతో నబద్ధము లాడియుంటినా?

సత్య—(విషాదము) అకటా! కాలమహిమ. సకల రాజవందితపదాంభోజుండగు సత్రాజిద్రాజేంద్రుని ముద్దుకూతునై, హరికిఁ

బిగ్గియంపుసతినై, పదునారువేల గోపికాస్త్రీలలో, అష్టభార్యలలో నీకన్న సుందరియుఁ బ్రియంపుసతియు లేదని మెప్పులు వచించిన పతి, సపత్నులయెదుట నొకసన్న్యాసి దూరుచుండ విని సహించెనని వినవలసివచ్చెఁగదా! నేఁడెట్టిదుర్దినము! ఎట్టి యవమాన మందితిని! ఆ నారదుఁడు నేఁ డేలరావలయును? వచ్చిన పారిజాతపుష్ప మేల తేవలయును? తెచ్చి యిచ్చకమున రుక్మిణి కిచ్చిన నిచ్చుఁగాక - నాసపత్నులయెదుట నాకు గర్వభంగము గు ననుప్రశంస యతని కేల? వచించుగాక! నాథుఁ డిది విని సహింపఁదగునే? హా! విధికృతము! అవమానము దుర్భరము! భరింపఁజాల, భరింపఁజాల! నిక్కముగా భరింపఁజాల.

సీ॥ నిలుమన్న నచ్చోట ♦ నిలిచెడి నాథుండు
బాస లెట్టుల నేఁడు ♦ త్రోసి చనియె?
సర్వంబు నీకె యం♦చను ప్రాణనాయకుండు
పారిజాతము నెట్లు ♦ పరుల కిచ్చె?
ననుఁబాసి యొక్క_ క్షణం బుండ నేరని
పతి యెట్లు రుక్మిణీ♦పంచ నుండె?
అలిగి నైనను నెదు♦రాడని ప్రాణేశుఁ
డెట్లు లోఁగులు నన్నుఁ ♦ దిట్ట నోర్చె?
గీ॥ చూడ నియ్యది నాకర్మ ♦ చోద్యమగునొ
రుక్మిణీదేవి ప్రాప్తమో ♦ సాధికాదు;
ఏది మూలము కుటిల! యిం♦కేది సుఖము
మానభంగంబు భరియింప ♦ నౌనె? చెపుమ.

కుటి—దేవీ! యూరడిల్లుము చింతించిన ఫలము లేదు.

సత్య—కుటిలా! ఊరడిల్లు మనియెదవా! ఇంక నా కీలోకమున నూరడిల్లి యనుభవించు సౌఖ్యంబు లున్నవా? అయ్యో!

ఉ॥ నన్ననయంబు గౌరవమ♦సంబునఁ బ్రేముడి మెచ్చునాథుఁ డీ
చెన్నున మాయలం బరపి ♦ చెంత వసించిన నా సపత్ని లె

న్నెన్నియో పల్కనూరకొనెనే ? మునిపల్కులకేని మాఱుపే ర్కొన్న సహింతుఁగాక నిఁక ♦ కోమలి! యేగతి నూరడిల్లుదున్.

ఈ గృహంబులు,(భూషణములు దీసి జడ విప్పివైచుచు) ఈ భూషణంబులు, ఈ శమంతకమణి,ఈ ధనరాసులు, ఈ దాసీజనములు,ఈజీవితము, నాకేల? భరింపఁజాల. నిక్కముగా భరింపఁజాల.

(తెర వ్రాలును.)

(ప్రవేశము : కృష్ణజయంతులు.)

జయం—వయస్యా! నీ కా పిచ్చి యింకను వదలలేదఁటయ్యా?

కృష్ణు—(నవ్వి) జయంతా! నీకు హాస్య మనిన నంతపిచ్చియో నాకు సత్యభామ యనిన నంతపిచ్చి.

జయం—ఆపిచ్చియే యింతవరకువచ్చిన దని యెఱుంగఁజాలవు కాఁబోలు! మున్నొకసారి నా భార్య యలిగియుండఁగా బ్రతిమాలుట కేగి పాదస్పర్శనభాగ్యము లభింపఁ దిరిగివచ్చితిని. ఏ మయినను మాబోటి బాపలకు చెల్లుబడిగాని మీరాజులకుఁ దగునఁటయ్యా!

కృష్ణు—జయంతా! సాత్రాజితీదేవి నీభార్యవలె నవివేకిని యనుకొంటివా.

జయం—ఎవరి భార్యలు వారికి ముద్దేయగును గాని -

కృష్ణు—అదికొంచెము బయలుపెట్టుము.

జయం—అబ్బా! ఎంత లౌక్యముగా మాట్లాడుచుంటివి. అవును, నీవలె నాభార్య మంచిది యని చెప్పుకొనుటకు మాత్రము నేను తెలివితక్కువవాఁడనే. భార్యాపరాభవము బట్టలో తొడపాశము వంటిది. కావుననే మీవంటి మహనీయుల కెట్టిగా కందియున్నను బయల కగుపడ నేరదు.

కృష్ణు—జయంతా నీకవితాధోరణి నా కర్థ మగుటలేదు.

జయం—అర్థం - నాశార్థం! నీకర్థము కాలేదా? చెప్పెద వినుము. సత్యభామ గడియ కొకసారి యలుగుటయునైన నెరుంగుదు వుగదా? ఇప్పు డామె పారిజాత మీయ లేదను నెపమున నేమి యొనర్చునో యని నాకు భయమగుచున్నది. ఒకవేళ నవమానమే జరిగినచో లోకమున నపవాదు చిరస్థాయిగా నిలుచునుగదా. ఆలోచించుకొనుము.

కృష్ణు—(నవ్వి) జయంతా! అది నే నెఱుంగకపోలేదు. కీర్త్యపకీర్తులు లోకమున వెదజల్లుటకే నారదునిచే నిక్కార్య ముపక్రమింపఁజేసితి. ఇందువలన సత్యభామ కొకింతజ్ఞాన మలవడఁగల దని తలంచెద.

జయం—నీ యిష్టమువచ్చిన ట్లాచరింపుము. లోకనాటకసూత్రధారుండవగు నీ కీనాటకమునఁ బాత్రలు తక్కువకాఁగలవా యేమి?

కృష్ణు—రమ్ము. (జయంతుఁడు వెనుకరా కృష్ణుఁడు ముందు నడచుచుండును).

జయం—(నిలుచుండును).

కృష్ణు—(వెనుకజూచి) జయంతా! నిలుచుంటి వేమి?

జయం—ఏమి చేయుమని యెదవు?

కృష్ణు—రమ్ము.

జయం—ఎచ్చటకు?

కృష్ణు—సత్యాదేవి మందిరమునకు.

జయం—ఇది యెవరి మందిరము?

కృష్ణు—ఇది సత్యాదేవి మందిరమా! (తేఱిపారఁజూచి) ఓహో, నిజమే. పొరపడితిని.

జయం—నెచ్చెలీ! సత్యాదేవి మందిరమునే యానవాలు పట్టనేర కున్నవాఁడవు, సత్యాదేవిని సైతము మానవాలు పట్టలేక దాసి యగు కుటిలను సత్కరింతువా యేమి?

కృష్ణు—(నవ్వి) జయంతా! నీ హాస్యమున కేమిగాని సత్యాదేవి మందిర మిట్లు కాంతిహీనమై యున్న దేమి? ఎవ్వరు కానరా రేమి?

సీ॥ చారుపంజరమధ్య॰కీరంబులను జేరి
చదివింపు మనెడి॰ చిలుక యేరి
మొనసి హంసలను బా॰మోద ము మీరంగా
నడిపించుచుండెడి॰ పడతు లేరి
తాళగతులకు సర॰దారుగా నెమళుల
నాడించుచుండెడి॰ యతివ లేరి
ననుగోళ్లఁ దంతుల॰ నొత్తుచు వీణలఁ
బలికించుచుండెడి॰ లలన లేరి
నేను వచ్చెడుచప్పుడు॰ వీనఁ దోయిఁ
బడినయంతనె రివ్వున॰ వచ్చు సత్య
భామ నేఁ డేల రాదు! వి॰భ్రమము తోఁచె;
సకట! సత్యాగృహం బిట్లు॰ లగుట కేమొ.

జయం—ఎక్కడ నేర్చితివయ్యా యీ టక్కరి పన్నుగడలు? ఇట్టి వాఁడవు కనుక నే సత్యాదేవియొద్ద సాగించుకొనుచుంటివి. అయిన నీ సాగుబాటు నేఁటితోఁ గాస బయలుపడును.

కృష్ణు—జయంతా! సత్యభామ కోపము నెంతలో మాయునో, సేతునో తెలిసికొందువు లే.

(నిష్క్రమించును.)

జయం—అనుభవించెదవు లే. పొమ్ము.

(తెరవాలును)

[విగతభూషణురాలై నేల పరుండియున్న సత్యభామ]

కృష్ణు—(ప్రవేశించి విగతభూషణురాలై పరుండియున్న సత్యభామ దరిఁ గూర్చుండి) సత్యాదేవీ! సత్యాదేవీ! ఇదేమిరీతి! ఈ చెయ్విదము లేమిటి! ఏల యిట్లు కటికిరా నేల విశ్రమించితివి? మదనచాపములఁ బోలు నీ కన్బొమ లేల ముడిచితివి? నూపురప్రకాశమానమగు నీ పదసరోజంబు లిట్లేల కాంతివిహీనత జెందినవి? నీ యాభరణము లేమాయెను? ఎవరిపై నీకీ కోపము?

సీ॥ ప్రేమభాజనమును ♦ గామించుకొనుదో యి
 పొలయల్క నను వంచుఁ ♦ బూననేల
అగరుచందనపూత ♦ లలరు నీ దేహ మీ
 మలినవస్త్రము గట్టి ♦ మాపనేల
కరిదంతములనవ్వు ♦ నిరసించు చెక్కిలిఁ
 గఠినాంగుళీస్పర్శఁ ♦ గరువనేల
హంసతూలికశయ్య ♦ నలరుచుండెడి మేను
 పలుగురాలఁ బరుండి ♦ బడలనేల
తలఁపఁగ శిరీషకుసుమ పేశలత మించు
మానసము చిట్టిచింతల ♦ నూననేల
అలసటను జెందనేల? యీ ♦ యలుక లేల
చారుతరగుణసీమ! యో ♦ సత్యభామ!

నిన్నీ కఠినపాషాణశయ్యాతలంబునఁ బరుండఁజేయునటు లాగ్రహముఁ గల్పించిన యా గొప్పతప్పిద మెవరిదో వచింపుము. వారిని దగురీతి శిక్షింతును. (చేయి పట్టును)

సత్య—ఓయీ! కపటనాటక సూత్రధారీ! ప్రాణసతీ వంచకా! వెన్నదొంగా! నీ టక్కరివినయంబుల నా ముందర వచింప వచ్చితివా! పో పొమ్మి. (తన్నును)

కృష్ణు—(నవ్వి) అలికుంతలా! నీ తప్పునకు నీ వెట్లు శిక్షించుకొందువని యరసి నీవే నన్ను శిక్షించితివి. సంతోషము. కాని

చ॥ అనవరతంబు నీవె సతి ♦ వంచు మనంబున నెంచు నన్ను ద
న్నినపోఁ యల్క కే నగవ ♦ నీస్మృదుపాదసరోరుహంబు మ
త్తనువున దాకి కందెనుగ ♦ దా యిని వింతయొనర్తు; వింతనై
నను నను నేలు మీాయలుక ♦ న్యాయముగాదు సుమా! తళోదరీ!

సత్య—(కూర్చుండి) కృష్ణా! ఏమీా! నీ టక్కరిప్రేమలు నమ్మి మోసపోవుదు నని తలంచితివా? చాలింపుము నీ రచనా వ్రిగల్భములు.

కృష్ణ—లలనామణీ! ఇవి యేటిమాటలు? నీ చరిత్ర మాశ్చర్యముగా నున్నదే?

చ॥ మన నరయంగ నెంచి యిటు ♦ మార్గము బన్నితో, నవ్వులాటకో
నను వెరపింపఁజూచెదవొ, ♦ నాయెడ నక్కరపు తప్పు గల్గెనో,
నిను నెవరైన మోసమున ♦ నేరము లంకగఁ జేసియుండిరో,
వనరుహనేత్ర! నేను నగ♦వాఁడనె? కోప మదేల చెప్పవే?

సత్య—గోపాలకృష్ణా, నను బలుకరింపకుము. నీవు నాకుఁ బగవాఁడవు కావు. ఇష్టుఁడవు కావు. నిన్ను పరీక్షింపఁ దలకొనునంతటి దానగాను. నాకిగ్మమునకు నీ వేమి చేయఁగలవు నీ హృదయసీమయందు ననుదినము నే యువతి తాండవమాడుచుండునో, ఏకాంత యునిన నీ పంచప్రాణముల సమర్పింపఁదలంతువో, ఏ లలనాశిరోమణి నీ వొసంగునవి కైకొనఁగలుగునో, ఆ యువతిని జేరఁబొమ్ము. అచట నీ వినయంబులఁ బ్రదర్శింపుము. నీవన్నుగడల సాగింపుము. లెమ్ము. పొమ్ము.

కృష్ణ—సాత్రాజితీ! ఎన్నడైన యిట్టులాడియుంటివా? నా హృదయ మెరుంగనిదానవా? నీవుగాక నా కెవరు ప్రియులు గలరు? నే నెవ్వరిని జేరఁగలను? కల్ల, అటుల నితరుల నాశ్రయించుట కల్ల.

సీ॥ లలితపల్లవభోగ • లసదనుభవమైన
కోయిల శిశిరంబుఁ • గోరుకొనునె
వికచప్రసూనమౌ • విరజాజి వలదంచు
అళి కేతకీవన • ములకుఁ జనునె
చిఱుతవెన్నెల సిగ్గు • పరిహసించి చకోర
సతి ప్రేమ మిడియెడ • కానవడునె
ఘనమృణాళీయు • కాసారములఁ బాసి
కలహంస మడువుల • వలచి చనునె
గీ॥ కనకపంజరసౌభాగ్య • గరిమఁ ద్రోసి
కీరమిలఁ గంటకములకుఁ • గేళిఁ జనునె
సకలసౌఖ్యావహంబు కా • స్థానమైన
నిన్ను విడనాడి పరులకో • నిలువఁగలనె?

సత్య—ఓయీ! కైతవవచోనైపుణ్యశీలా! గోపాలా! ఎట్టివన్ని గడలఁ దాల్చుచుంటివి నీ వెని, రచించిన రచింపుము.

గీ॥ సారసగంధి పుష్పంబు పగిది
భావనామాత్ర రచనావిభవము కరణి
ప్రేమ లేకున్న నీవచః • ప్రీతి నాకు
శాంతిఁ గూర్చదు కృష్ణ! నిస్సంశయముగ.

కృష్ణ—మానినీ! నా ప్రేమకుఁ గారణంబు నీవుగదా? నాహృదయ రంజనమతివి. నా ధనమవు. నా సకలము నీవుగదా. నీవుగాని దేది నా మనము రంజింపఁగలదు? అనవరతము నీ చెయిదములే నా మనసునందు తలిపెదను. నీ సౌందర్యలతా సౌభాగ్యమే నా చూపులఁ గలిపెదను. ఒరుల ప్రేమల హృదయము నుండి దులిపెదను. సతుల సలిపెదను. ఆనందించెదను. నిద్రించెదను. ఇతరుల 'భిలషింతునా? ఇందులకు నా పరమాత్మయొక సాక్షి. నాహృదయమొక సాక్షి. వేరుసాక్షి కావలయునా? నరకాసురకదనమునకు నిను గొనిపోవుట నీ వొకసాక్షి.

సత్యా—నిజము. నీహృదయ సాక్షికిని నా పరమాత్మసాక్షికిని నాసాక్షికిని పారిజాతపుష్ప మొకటియే సాక్షి.

ఉ॥ ఈపరిపాటి నీవు వచియింపఁగ నేర్తువటంచుఁ గాదె నీ
వా పువు రుక్మిణీసతి కొసంగితి వంతియె చాలు నేఁడు నీ
వీ పలికింబు దాల్చిన • నేతియు మోసముసేయవచ్చితే!
హా వలుగాకి నీదయయె యున్నట నప్పటు సేయుచుండెదే.

కృష్ణ—రమణీమణీ! పారిజాతపుష్ప మిచ్చుటకుఁ గారణము లేక పోలేదు.

సత్యా—సపత్నులచే వినరానిమాటల నిపించుటకును గారణము గలదా?

కృష్ణ—ఎవ రనిరి?

సత్యా—విన్నవారే.

కృష్ణ—పిచ్చిసత్యా! యిది యంతయు నమ్మితివా? ఎవరో మన యిరువురమధ్య తగవుపెట్టుటకై వచించిన పలుకుల నమ్మి యలుకఁబూనుట తగునా? నాహృదయము మీ వెఱుఁగవదియా? నా పంచప్రాణములు నీసేవాభాగ్యమున కెదురుచూచుచుండును గదా. అట్టియెడ నన్నొవ్వనాడ నీకు మనసు గల్గెనా? తెమ్ము. నీయలుక మానుము. నన్నుసంగిసామ్రాజ్య పీఠంబున కధిపతిని జేయుము. యువతిధర్మ మనుసరింపుము. నీ ప్రణయచూడ్కుల నైసింపుము. నాతప్పుల మన్నింపుము. సత్యా! యింక నే నేమనఁగలను?

సత్యా—కృష్ణా! నే నెవరని తలంచి యిటులాడుచుంటివి?

సీ॥ పాలయల్కఁ గడుపేర్మి • లోలయ విన్నాదరిం
పఁగ జాంబవతియను • పడఁతిఁ గాను
అతిబాళి గతిదూలి • రతికేళికిని దేల్ప
మిత్రవిందను బోలు • మెలఁత గాను
సతిధర్మగతి నీకు • హిత మొనఁగూర్పఁగా
లక్ష్మణ కెనయైన • లలనఁ గాను

అలుక మానుచు నూర్ధ్వ ♦ లోలుకు భాషణముల
రంజింపఁ గాళిందిరమణిఁ గాను
వరగ నీయిష్టములఁ దీర్ప ♦ భద్రఁ గాను
చెలగి మెప్పింప నాయామి♦జితిని గాను
లీల నీమోహ్ప నంది పెం♦డ్లినిఁ దగుల్కొ-
ని చనుదెంచిన రుక్మిణి ♦ నేను గాను.

పొమ్ము నాకు నిద్రాభంగ మేల చేసెదవు? రుక్మిణి నేల బాసెదవు. నాకై యింత యేల వగ చెదవు? ఇక్కడికి కర్ధరాత్రము గతించినది, పొమ్ము.

కృష్ణ—సత్యాసతీ! నన్నేల నిష్ఠురముల పాలు చేసెదవు? అర్ధరాత్రము గతించిన దని చింతింప నేటికి? నీవంటి సౌందర్యకామినుల భాషణముల వినఁ గుతూహలించగు పురుషునకు బహురాత్రులును తృణతుల్యములు కావే. రమ్ము. ప్రియపతి నగు నా కోర్కెదీర్పుము.

సత్య—ప్రాణేశ్వరా! నీ వేమైన నను. కఠినచిత్త నని తలంపుము. కాని విన్ము గురించి.

సీ॥ భయదపర్యాప్తజృంభణకృతాంతుని పాశ
బద్ధజీవుని నైనఁ ♦ బడయఁగలను
భూనభోవ్యాప్తసంభూతజగత్త్రిశి
యాగ్నికీలల కెదు♦రరుగఁగలను
మునసి గంభీరవి♦ణ్మాత్రిపురీష వై
తరణీనదిని నైన ♦ దాటఁగలను
ఉరగేంద్రఫణిజని♦తోగ్రస్వరూప వి
భాజిత విషమైనఁ ♦ ద్రావఁగలను
కాని యనుదినము యమకిం♦కరులఁ బోలి
మనసుబాధించి నిందించి ♦ మానభంగ
గతులఁ బలికెడు సవతుల ♦ గలసిమెలసి
కాపురం బొనరింపగా ♦ నోప నాథ!

కృష్ణ—సత్యా! అటులయిన వారిస్నేహము పరిహరించితి రమ్ము.

సత్య—(మాట్లాడకుండును)

కృష్ణ—సత్యాసతీ! వన్నెల మన్మథుని బాఁతి గప్పగింతువు! అన్నియుఁ దెలిసిన నీ విట్టిపట్టు వహింపఁదగదు. నామాట వినుము. నీయిష్టము లేక నొక యడుగునడచినచో నన్ను పరిభవింపుము. నీకుఁ గావలసిన దడుగుము, నెర వేర్పకుందునేమో! (అని సత్యభామ చేయి బట్టుకొనును.)

సత్య—(తనచేతితో కృష్ణునిచేయి విడిపించుకొనుభావమున జూపించుచు) నాథా! నీ వేల నన్నీవిధమున బాధించెదవు. రాగయుక్తమగు నాహృదయమునందు నీవు చిరకాలము వసించియు, కప్ప పద్మసౌరభము గ్రహింపఁజాలనియట్లపరక్తుఁడవు గాక రుక్మిణిమొదలగు కాంతల నభిలషించి పారిజాతపుష్పము వారి కిచ్చి యొకబడుగునన్యాసిచే ననరానిమాట లనిపించి సవతులవలన గేలిసేయించితివి నీమాట విన లేదని తలంపకుము. నాతప్పు లున్న మన్నింపుము. నాపై బాళి నుంపకుము. ఈపరిభవాగ్నిచే దహింపఁబడుచు నీధరణీసౌఖ్యంబు లందజాల. ఇక నాకా స్వర్గసుఖంబులే నిత్యములు. ఆనందములు. సౌభాగ్యములు. సంతోషములు.

సీ॥ రత్ననిర్మితసౌధ♦రాజమధ్యంబున
నే యింతి నిను రతి ♦ నేలఁగలదొ
నా తండ్రి మున్నిచ్చి♦నట్టి శమంతక
మణిఁ దాల్పనింక నే ♦ మగువ గలదొ
కీరపాళిని ముద్దు♦లార గీతంబులఁ
బలికించి వినఁగ నే ♦ భామ గలదొ
ముద్దుముద్దుగ నెల్ల♦పొద్దుల విహరింప
నుద్యానవనము కే యువిద గలదొ
ఈ ధనంబుల కిక కర్త ♦ యెవరు కలరొ
యింక నీ ముద్దుభార్యగా ♦ నెవరు కలరొ

నాకు జీవితమునఁ గోర్కె • నాస్తియయ్యె
వలుకరింపక పొమ్ము గో•పాలకృష్ణ!

కృష్ణ—తరుణీమణీ! జీవితముపై నాస లేనివిధం బొనర్చినది యీ పారి జాతపుష్పమే కదా?

గీ॥ ఎవ్వరో తోడ్తెవఁబోవు వా • రిచ్చినట్టి
పుష్పమున కిట్లు వగటనుఁ • బూననేల
తరుణి! నందనపారిజా•తంబు దెచ్చి
పెరట నాటింతు నింతట • ప్రీతిఁగనుము.

సత్య—నాథా! ఇది ప్రసన్నహృదయమా!

కృష్ణ—నిక్కువముగా.

సత్య—ఏది చేతిలోఁ జేయివేయుము.

కృష్ణ—(అటు లొనర్చును)

సత్య—(కౌగిలించి) నాథా! ధన్యనయితిని.

కృష్ణ—నేనును ధన్యుఁడనైతిని.

(తెర వ్రాలును.)

గద్య

ఇది శ్రీవేదశైలలక్ష్మీనృసింహ కరుణా కటాక్ష వీక్షణ లబ్ధకవితా మధురభాగధేయ సూరిజనవిధేయ యేజెళ్ల వెంకటసుబ్బయ నామధేయ ప్రణీతంబైన సాత్రాజితీ గర్వభంగమున ద్వితీయాంకము.





శ్రీ

# సాత్రాజితీ గర్వభంగము.

## తృతీయాంకము.

### 1 వ రంగము,

(సత్యభామ మందిరము - కృష్ణుఁడు, సత్యభామ, జయంతుఁడు)

కృష్ణ—సత్యా! అమరావతీదిగ్గనాభిలాష జనించెనా? నా మాట వినుము, మరియొకసారి కొనిపోయెదను.

సత్య—ప్రాణేశ్వరా! మీ పలుకులయందింత సత్యముండునని యెఱుంగక మోసపోయితినే. నిన్నఁగదా! సురనగరమునకుఁ గొనిపోయెదనని వచించితిరి.

కృష్ణ—దేవీ! స్వర్గయాత్ర బహుకష్టము. నిరంతరము సౌధపరిచయలగు స్త్రీలా త్రోవ నడుచుట దుస్తరము.

సత్య—మీతోఁ జనుదెంచు నాకేమియు దుస్తరము గాదు.

జయం—నా భార్య యితరసహాయములం దెట్లున్నను తిరునాళ్లకుఁ బోదలఁచినప్పుడు మాత్రము నాతో వెడలాట బహుసుఖముగా నుండునని చెప్పుకొనును.

కృష్ణ—ఇంతీ! ఇవి పురసౌధాంతర్భాగవచనంబులు. కాని ఆ ఘోరకాంతారనిర్గమకార్యావలంబినివైనప్పుడు నేమిగా వచింతువో తెలియనగును. స్వర్గమార్గమున నేమిగా దలంచితివి?

సీ॥ నిమ్నోన్నతమహీధ్రనిర్ఝరపాషాణ
తతి గాని సోపానతతులు కావు
కంటకనిబిడప్రకాండతరువ్యూహ
ములు గాని రాజవీథులును గావు
మధ్యాహ్నభాస్కరమహితాతపజ్వాల
లవి గాని శశికిరణాళి గాదు
పవనాహతతరంగబహుళనదీనిర్గమా
ద్యములు గా నవి తటాకములు కావు
ఏమి సుఖమంచు స్వర్గంబు కేగుదెంతు
ఇంట నుండుము మందారమిపుడె తెచ్చి
నీ వనంబున నాటింతు నిక్కముగను
నవరసానందసీమ! శృంగారధామ!

సత్య—నాథా! యింతయెందులకు? నే ననలేదనిన నొకమాటతోఁ బోవునుగదా.

కృష్ణ—దేవి! అనుభవించుదానవు నీవు కలుగ నా కేమికష్టము? అటులనే ప్రయాణంబు గమ్ము.

జయం—నేను ప్రయాణము గావలెనా?

కృష్ణ—నీ వెందులకు?

జయం—నాభార్య నన్నొకసారి తిప్పలు బెట్టుచుండ గిరిజాతము దెచ్చి యిత్తునని యొప్పుకొంటిని.

కృష్ణ—నీ వసహాయశూరుఁడవే! అటులయిన రమ్ము.

జయం—భోజనము జేయు నాలస్య మున్నదా.

కృష్ణ—భోజనమయి వెంటనే ఆయుధశాలకుఁ బోయి యందు నదటి కుండలము లున్నవి తీసికొనిరమ్ము.

జయం—స్వర్గమునకు బోయినను వడియోకులు తప్పునట్లు లేదు.

(నిష్క్రమించును)

కృష్ణ—సత్యా! తొందరజేయుము. మీయాడువారి ప్రయాణము మిగుల విసుగు జనించును.

సత్య—నాథా! మీ కంత కష్టముగానున్న నేను రానులెండు. మీరే చనుఁడు.

కృష్ణ—యువతీ! నా కేమియు కష్టములేదు రమ్ము. ఇంతటికే కోపమా?

సత్య—మీ రేమైన ననుఁడు. నేను రాఁజాలను. ఇష్టములేనిది విలపించిన వచ్చునా.

కృష్ణ—మానినీ! లోకోక్తిగా నన్నమాటకే క్రోధము వహింతురా. (చేయి పుచ్చుకొని) లెమ్ము. ప్రయాణమగుము. (ముందుచూచి) అదుగో నారదముని వచ్చుచున్నాఁడు.

(నారదుఁడు ప్రవేశింపఁ గృష్ణుఁడు నమస్కరించును)

దేవా! యీ పీఠ మలంకరింపుఁడు.

సత్య— గీ॥ ప్రొద్దు లేచినతోడనే ♦ భువనమందు
వారి పీరికిఁ దగవుల ♦ నూరిపోసి
కలహాభోజనమున ప్రొద్దు ♦ గడపుచుండు
నారదా! నీకు నా నమస్కారమయ్య.

నార—(తనలో) ఏమీ పారిజాతపుష్పము రుక్మిణి కిప్పించితిననియా, సత్యభామ కలహాకర్తవని యెగతాళిగా నమస్కరించుచున్నది. కానిమ్ము తగినట్లు ప్రత్యుత్తర మొసంగెద. (ప్రకాశము)

చ॥ మగువలు సర్వకార్యముల ♦ మానక నీదరిఁ జేతురే కదా;
నగలును నాణెముల్ గృహము ♦ నందున జాల లభించియుండఁగా;
తగ మగఁ డన్ని వేళలను ♦ తన్నులనే భరియించుచుండఁగా;
మగువ! యిఁకేమి నీకు శుభ ♦ మంచును దీవన లిత్తుఁ జెప్పుమా.

సత్య—(తనలో) అకటా! నే నెవరిని బలుకరించినను నవమానమే నన్ను వరించుచున్నది. కానిమ్ము పారిజాతము దెచ్చినతరువాత వీర నందఱి నొక్కసారి పరామర్శింపఁగలను.

కృష్ణ—మునీంద్రా! మీర లిప్పు డెచ్చటకుఁ జనుచుండిరి.

నార—నందనందనా? నా కొకచోట కాపురమా? అన్నిలోకంబులు చూడవలసియే యున్నది.

కృష్ణ—పదిదినంబులలో మరల ద్వారక కరుగుదెండు.

నార—మంచిది, కంసవైరీ! నాకు సెలవా

కృష్ణ—మంచిది.

(నారదుఁడు నిష్క్రమించును. తెరపడును)

( 2 వ రంగము )

[తెరయెత్తగా—అమరావతి; ఏకాంతమున, నారదుఁడు, ఇంద్రుఁడు.]

నార—దేవేంద్రా! నే జెప్పునది నీ మనసునం దుంచుము. ఎన్నివిధంబులయినప్పటికిని పారిజాతముమాత్రము కృష్ణున కీయకుము.

ఇంద్రు—సురమునీంద్రోత్తమా! దేవకీనందనుఁ డన్నివిధముల మాకాప్తుఁడు కదా అడిగిన నెట్లు కాదననలయును?

నార—అతఁ డడిగి మన్నన గొనిపోవ ననుకొంటివా యేమి? అతని పన్నుగడలు నాకుఁ దెలియును.

ఇంద్రు—ఏమి చేయును.

నార—దౌర్జన్యయుతముగా నే.

ఇంద్రు—అందువలనఁ గలుగు ఫలిత మేమికలదు.

నార—కృష్ణుఁ డింద్రుని జయించెనను లోకకీర్తి కే.

ఇంద్రు—(కోపముతో) ఏమీ సర్వబృందారకేంద్రుండగు నీ యింద్రుని నొక వెట్టిగొల్ల జయింపదలఁచెఁగా.

నార—(తనలో) ఇంద్రునకుఁ గ్రోధమను పిశాచ మావరించుచున్నది. ఇంకను బురికొల్పెదఁగాక. (ప్రకా) పాకశాసనా! నీ బింకము లేల నాముందర వచింతువు. సర్వబృందారక పూజనీయుండవు గానిమ్ము. పురహరుఁడవు గానిమ్ము. సర్వదానవారాతియగు కృష్ణునకు నీవలన భయము గల్గుననుకొంటివా?

ఇంద్రు—మునీంద్రా! నా బలము నీ వెఱింగియుండియు నిటులు పల్కెదవేల? ఇష్టమున శరీర మర్పింపవలయునన్న వెను దీయను. కాని పగచేఁ బూరితమైన నోసంగుదునా.

నార—నీ బలము నేనేకాదు నీవును నెఱుంగుదువు. మొన్న నరకాసురునిజయింపలేక కృష్ణుని శరణుజొచ్చిన నీ బా॥ మందరకుఁ దెలిసియే యున్నది.

ఇంద్రు—నోటికి వచ్చినటులెల్ల వచించిన సరిపోవునా? అది నన్నొక్కనిమాత్రమే రోటమిపరుచుట లేదు; కృష్ణునికిని నట్టివి కలవు.

నార—ఇంద్రా! నీ వెన్నిపలికినను మేకపోతుగాంభీర్యమే కాని క్రియ యెట్లు జరుగునో చూతును కదా.

ఇంద్రు—ఔను, పగచేత వాసుదేవునకుఁ బారిజాత మిచ్చినపు డిట్టి నిందను జేసిన సహింతును.

నార—ఇఁక నాకు సెలవా?

ఇంద్రు—మంచిది.

నార—(నిష్క్రమించును)

శచీ—(ప్రవేశించి) నాథా నమస్కారము.

ఇంద్రు—ఇష్టఫలప్రాప్తి రస్తు. దేవీ! యింత తడవేల చేసితివి.

శచీ— పూజ్యులగు నారదమునీంద్రు లేతెంచుటచే నాలస్యమాయెను. నాథా! శౌరి మనపైఁ బగఁగొనుటకు కారణ మేమై యుండును.

ఇంద్రు—నరకాసురుని గెల్చితి ననుగర్వమే యతనిని స్వర్గము నాక్రమింపఁజేయుచున్నది.

శచీ—ఎటులైనను పారిజాతముమాత్ర మీయకుఁడు

ఇంద్రు—నోరుదెంచి యడిగినమాత్రమున నియ్యక తప్పదు. నారదునిమాటలే నిజమయ్యెనా, యిచ్చుటలేదు. (తెరలో) సుర

లోకేశ్వరా! ద్వారకానగరమునుండి సత్యభామాశ్రీకృష్ణులు మనవీటికి వచ్చియున్నారు.

ఇంద్రు—(అలకించి) ఓయీ! నీవు గురువర్యులగు నాంగీరసులఁ దోడ్కొని రమ్ము ప్రియసఖీ! సత్యభామను గౌరవించుటకు నీవును రమ్ము.

శచీ—అటులనే గానిండు. (అని యిరువురు లేవగా)

(ప్రవేశము: బృహస్పతి)

బృహ—సురపాలా! యేల నను బిలువనంపితివి?

ఇంద్రు—గురువర్యా! నమస్కారము. వాసుదేవుఁడు సత్యభామాసహితుండై మననగరప్రాంతమున నున్నాఁడని విని వారిని బరామర్శింప వలయుటచే మిమ్ములఁ బిలువనంపితిని.

బృహ—మంచిది నడువుము.

(అందరు నిష్క్రమించి మరల ప్రవేశింప సత్యభామా శ్రీకృష్ణ జయాతిరేకముగా జనుదెంతురు.)

ఇంద్రు—వాసుదేవునకు స్వాగతము.

బృహ—దేవకీసూతికి విజయము.

కృష్ణు—సురాచార్యుల కభివాదము. బిడౌజునకుఁ గుశలము.

ఇంద్రు—నందనందనా! ద్వారకానగరమునకు క్షేమమా?

కృష్ణు—బలశాసనా! సౌఖ్యముగా నున్నారము. సురకోటికిఁ గుశలమా?

ఇంద్రు—మహాత్మా! నీ దయవలన నరకవధానంతరమున స్వర్గసీమ హాయిగ నిదురబోవుచున్నది.

బృహ—స్వర్గసీమయే కాదు - సర్వలోకములు హాయిగాఁ నిదురబోవుచున్నవి.

శచీ—సత్యాదేవి! కుశలమా?

సత్య—అక్కగారూ! మీకు భద్రమా?

శచీ—చెల్లెలా! నీనాథుని దయవలనను, నీ ప్రసాదంబున భద్రయుతులమై యున్నారము. అమ్మా! ఆనరకుని దుండగములు దలచినపుడెల్ల హృదయము ఝల్లుమనుగదా! అతిసుకుమారివి, ఆదుష్టునితో నెట్లు పోరితివి?

సీ॥ పసిఁడిమేడలనెక్క ♦ భయమందుదానవు
ఖగరాజు నెట్లెక్కఁ ♦ గడగితమ్మ!
చిలుకలరొద మది ♦ చెడి కుందుదానవు
వైరిగర్జన కెట్లు ♦ వలసితమ్మ!
లలిత రేయెండకే ♦ నలసెడిదానవు
మిడియెండ నేరీతి ♦ మెలఁగితమ్మ!
కొలికికి ముత్యంబు ♦ గూర్ప నేరనినీవు
నలుగు వింటికి నెట్లు ♦ గలిపితమ్మ!
పాకశాసనులాది దో♦ర్బలులకేని
సంగరంబున నొప్పింపఁ♦జాలనట్టి
నరకు నెట్టుల నొప్పింపఁ ♦ బరగితమ్మ!
అమ్మ! నీధైర్య మతిచిత్ర♦మమ్మ! సత్య!

సత్య—అక్కా! అది యంతయుఁ బ్రాణేశ్వరునిదయయు మీవంటివారి దీవెనలును గాని నాయుపాయము గాదు.

బృహ—వాసుదేవా! యీతఁ డెవరు.

జయం—ఇంతవరకు నాగోల నాలించినవారే లేరు. కాని కులాభిమానముచేత సురగురుపుమాత్ర మిప్పు డడుగుచున్నాఁడు.

కృష్ణ—ఇతఁడు నావేడుకచెలికాఁడు - జయంతుఁడనఁ బరగువాఁడు. బ్రాహ్మణవంశజన్యుఁడు! జయంతా! కుండలములు! వజ్రికిమ్ము.

ఇంద్ర—(అందుకొని కన్నుల కద్దుకొని) వసుదేవనందనా! నీమేలు మఱువఁదగినది కాదు.

జయం—సురేంద్రా! ద్వారకానగరమునుండి యెద్దుమోత బరువు దెచ్చిన నామేలు నడుగుననే వైచితివికదా.

ఇంద్రు—(తెల్లబోవును)

కృష్ణ—బలశాసనా! ఇతఁడు హాస్యప్రియుఁడు. జయంతా! యెంత కష్టపడితివో.

జయం—పిండుబండికి పెండతట్ట బరు వన్నట్లు నాయొడలు నేనె మోయఁజాలనిబలవంతుఁడను. నాకివి మాత్రము కష్టము గావా యేమి?

అందఱు—(నవ్వుదురు)

శచీ—సత్యాదేవీ! గృహమున కరుగుదము రమ్మా.

ఇంద్రు—కంససూదనా! పురమునకు రండు.

బృహ—జయంతా! నీవు మాయింటికి రమ్మా.

జయం—సురాచార్యా! కులము వాఁడవు. నీ విక్కడ లేనిచో వీరు నామాట దలఁతురనుకొంటివా? ఇంతకు నాయదృష్టము బాగున్నది.

(అందరు నిష్క్రమింతురు)

3 వ రంగము.

(తెర యెత్తగా నందనవనము: సత్యభామా శ్రీకృష్ణ జయంతులు)

కృష్ణ—తన్వీ! సురనగరోద్యానవనము వీక్షింపుము.

సీ॥ మకరందమాధుర్య♦మధురగీతంబులు
వెలసెడి నెత్తమ్మి♦కొలకు లమరి
సుమతేజవనలతా♦సూక్తిపుంజంబులఁ
గొమరారు నుపవన♦గములఁ గలిగి
పలుచిత్రముల కోయి♦లలు భక్షణము జేయు
పల్లవయుతచూత♦వనము లొప్పి
లలనామణీ నవ్వు♦లాగు వల్వాయసం
ప్రకటించు దాడిమీ♦ఫలము లలరి
నింబఖర్జూరపూగవృ♦క్షంబు లొలయ
నృత్యసౌభాగ్యములఁ జూపు ♦ నెమళు లొకట

చంచలతఁ గొల్పుచుండు రాయంచ లొకటఁ
గలిగి యానందమును గూర్పఁగలుగు నహహా!

సత్య—నాథా! పారిజాత మెచ్చట.

కృష్ణ—అదిగో! నాయెడఁ గన్పడు నవమాలికా మాలతీ చంపకముల మధ్య విరాజిల్లునదియే పారిజాతము.

జయం—గిరిజాత మెచ్చట?

సత్య—జయంతా! గిరిజాత మనఁగా నేమి?

జయం—అది కొండగోగని దాక్షిణాత్యు లందురు.

కృష్ణ—(నవ్వి) కొండగోగు మన ద్వారకలోఁ గముయుందు లేదా?

జయం—స్వర్గమునుండి తెచ్చిన గౌరవనీయము కదా.

సత్య—నాథా! పారిజాతము జూచుటకై నామనంబు వేగిర పడుచున్నది.

కృష్ణ—రమ్ము. (అంగొని పారిజాతము దరిఁజేరుదురు) తరుణీ! యిదియే పారిజాతము. జయంతా! బ్రాహ్మణుఁడవగు నీచేతితోఁ బెకల్పుము.

జయం—(భయపడి) అమ్మయొయ్యో! వయస్యా! పోయిన బ్రాహ్మణుఁడే పోవుఁగదాయని యాలోచించితివా యేమి! యీ వనపాలకుల వలన నే నింక బ్రతుకగలనా?

కృష్ణ—నీ కేమియు భయము లేదు. నే నుండగ నే నీ కపాయమా!

జయం—నిజము చెప్పుము. ముదుసలియైన మాయమ్మకు నే నొక్కఁడనే పుత్రుఁడను.

కృష్ణ—మరేమియు చింతవలదు.

జయం—(పెకలించును.)

కృష్ణ—ఇఁక రమ్ము, పోవుదము.

(అందఱు నడచుచుండ గంధర్వులు)

గంధ—గోపాలకృష్ణా ! యీ పారిజాతమునకు మేము కావలిగాయువారము. ఇది మా రాజాజ్ఞ లేకయే యితరుల కీయ వలను పడదు.

జయం—ఓయీ ! మే మెవరమో మీకు తెలియునా? మీరాజేంద్రుని గెలిచిన నరకాసురుని జంపిన యదుకులపతులు వీరు. నేను వీరి వేడుక చెలికాడను. జాగ్రత్త. (నడచుచుండ)

గంధ—(అడ్డము వచ్చెదరు).

సత్య—(కృష్ణుని చేతిపిల్లనందుకొని వారిని నెట్టి,) ఓయీ! పాలకడలి యందుదయించిన పారిజాతమునకు మీరాజు కర్త యగునా? లక్ష్మీకౌస్తుభము లెవ్వరివశ మయ్యెనో అతడే యీ పారిజాతమునకు కర్త యగును. మీ రాజదేవేరియొద్దకు బోయి సత్యభామ యిట్లు పలికెనని చెప్పుము. నీవు వీరకాంతవయేని నీ మగనిచే మాతో బోరాటు లొనర్చి గెల్చి పారిజాతము గ్రహింపుమనుము. లేదేని యూరకుండు మనుము. రాదు వివ యములే నాథా! నడువుడు.

(గంధర్వులు నిష్క్రమింతురు.)

జయం—వయస్యా! మనల నంత గౌరవముగా బూజించిన సంక్రందనుని యింటిలో దిని యింటివాసములు లెక్కపెట్టినట్లు నందనవనము జొచ్చి పారిజాతమును గొనిపోవుచు నయ్యమునకుం గాలు ద్రువ్వుట తగునటయ్యా?

కృష్ణ—జయంతా ! అది నిజమే కాని యింద్రునకు నాయందలి ప్రేమ యెంత గలదో పరీక్షింపందలంచి యిటు లొనరించితిని.

జయం—అడిగిన వలదనునా? పగయేల?

కృష్ణ—బ్రాహ్మణుడా! లోకమున నిష్టులగు వారికి ననేకమందికి ననేకవస్తువుల నిడుచుండుట సహజమే కదా. అటులగాదు. మేలునను విహితంబునను పగయందును బాటింపదగువాడే మిత్రుడు. కావున నిట్లు చేసితిని.

జయం—నీ యిష్టము వచ్చినటు లాచరింపుము కాని నన్నొకటి యంటఁ బరీక్షింపుము.

(తెరలో ధ్వని)

గీ॥ రాజరీతిని నాచేతఁ • బూజలంది
దొంగగతి పారిజాతంబుతోడఁ జనెదె
యింద్రు దోర్బలశక్తి వీక్షింతు గాని
నిలుము నిలుమట నిలు నవనీతచోర!

కృష్ణ—జయంతా! ఆలకించితివా? మహేంద్రుని వాక్యములు. త్రివిష్టపాధీశుఁడగు మహేంద్రుఁ డెక్కడ, పరోపకార చింతనాభిలాష యెక్కడ? విశ్వాసహీనులగు ధనమదాంధుల కే యుపకారమైన వినుతికి వచ్చునా?

జయం—నిజము. నా కది మహేంద్రుని వాక్యములవలన స్ఫురించినది.

ఇంద్రు—(పై పద్యము జదువుచు భటసేనలతోఁ బ్రవేశించుచు.)

కృష్ణ—ఓయీ కృతఘ్నా! రమ్ము రమ్ము. నీ గర్వ మడఁచెద.

జయం—వయస్యా! నాకు భయమెత్తుచున్నది గదయ్యా.

కృష్ణ—జయంతా! సత్యభామయు నీవును నిందే యుండుఁడు. ఇంద్రుని పీచమడంచి వచ్చెద.

జయం—ఏమో నన్ను నట్టేటిలో నుంచినావు. నీదయ, నా ప్రాప్తము.

శచీ—విప్రవర్యా! బ్రాహ్మణచాపల్యముఁ బోనిచ్చితివి కాదు. ఇటువంటి నూర్గు రింద్రులైనను భయములేదు.

జయం—నీ వా నరకాసురునితోఁ బోరుటవలన కొంతధైర్య మున్నది. కాని అదివరకు నీ ధైర్యము నే నెఱుంగనిదియా?

కృష్ణ—జయంతా! యిందే యుండుము (ముందునడిచి) ఓయీ! స్వర్గరాజ్యగర్వాంధకారప్రలాపా! మహేంద్రా! యేమి నీ కావరము? రమ్ము. నీ గీటడంచెద.

ఇంద్రు—ఓయీ వెన్నదొంగా! ఆవుల గాచుకొను నీవా నన్ను గెలుచునది? నీకు పుట్టుకతోనుండు దొంగతనములు వయస్సు

నను మాఱిసవి కావుసుమా. ఇట్లు దొంగవై పారిజాతంబు గొనిపోవుటకన్న 'దేహి'యనిన నీయకుందునా?

కృష్ణ—ఓయీ! ఈ వాసుదేవుఁ డంతవాఁడు నిన్నా దేహియని యడుగవలసినది? క్షత్రియకర్మనే యాచరించితిని.

ఇంద్రు—ఓహో! నీవు క్షత్రియకర్మ నాచరించితివా? నిజము. నీరీతి ధర్మకార్యావలంబులగు క్షత్రియులకుఁ గళంక మాపాదించును. ఓయీ! వెఱ్ఱిగొల్లా! ఇన్ని మోదులకు? పారిజాత మిచ్చెదవా? లేదా?

కృష్ణ—ఓయీ! దానవకుమారవిభ్రమహృదయా! మహేంద్రా! నీబీరముల కదరి పారిజాత మిచ్చుట కల్ల. చేతనైన కదన మొనర్పుము. కానిచో నగరమునకుఁ బ్రయాణమగుము.

ఇంద్రు—గోపాలా! కదనమా! కదన మన నేమిగాఁ దలఁచితివి?

సీ॥ వ్రేతలయిండ్లలో ♦ వెన్నముద్దలు గావు
ఘనవజ్రిస్పర్శపా♦కంబు గాని
గోపాలకులతోడ ♦ క్రోతియాటలు గావు
అరిభటవ్యూహభే♦దంబు గాని
కదుపుల నడవిలోఁ ♦ గలయఁ జుట్టుట గాదు
పరిపంథిసేన వి♦భ్రమము గాని
దూడతోకల బట్టి ♦ దుముకులాడుట కాదు
కరిరథాశ్వంబుల ♦ ఘటన గాని
కేళికారంగసీమ దృ♦గ్వీథిఁ జల్లు
పుష్పరజ మిది కాదు న♦భోప్రసన్న
ధూసరితవైరిజనపాద♦ధూళి గాని
కదన మదియేడ, నీ♦వేడ? కంసవైరి!

కృష్ణ—ఓయీ, నిజాస్థానగర్వప్రలాపా, సంక్రందనా! యుద్ధపరిచయుండ వగుటచే నమరావతిపై దండెత్తుదైత్యుల నందరిని

బరిమార్పఁ గలిగితివి. ఛీ! సిగ్గులేక నాయెడ నీ వీరకథ ప్రశంసింపఁ జొచ్చితివా? ఎవరిని గెల్చితివని?

సీ॥ అలసురమాత కుండలములు గైకొన్న
 యసురమూకలను జెం♦డాడినావా
సురకాంతలెల్ల నమస్సురు మని పిలపింప
 గా వారి రక్షింపఁ గలిగినావా
తపసి రాజులబట్టి ♦ దండించు దానవ
 సేనల జీకాకు ♦ చేసినావా
చింతామణీ భద్ర ♦ సింహాసనంబున
 సను నీద్బు నరకుని ♦ నెదిరినావా
గీ॥ యేమిమగఁటిమి గలదంచు ♦ నిటుల వీరు
 భంగి వచియింతు మత్కృత ♦ బాణనిశిత
 ధాటిపాల్గాక ప్రాణముక్త ♦ తనువునందు
 నలరువేళను నిను మెచ్చ ♦ నగును నింద్ర.

ఇంద్ర—గోపాలా! నీ వమితబలశాలి వగుటనే జరాసంధుని కోడి సముద్రమున ద్వారకానగరము గట్టించితివి. కాలయావనుని బారికి పారిపోతివి. చివర కాడుదానిచే తన్నులను పరిగ్రహించితివి. ఇట్టినీవు పరుల నెన్నిన దోసము గలదా?

కృష్ణ—ఇంద్రా! నోటికివచ్చిన ట్లెల్ల ప్రేలజొచ్చితివి. శరీరమున వేయి కన్ను లున్నగర్వమున వదరకుము. గౌతమునింటఁ గోడివై కూసిన నీ వీరాలాపముల నిచట నుపయోగింపకుము. వీరుండవైన రణమొనర్పుము, లేనిచోఁ బురమునకుఁ జనుము.

ఇంద్ర—కృష్ణా! రమ్ము. ఈ సురేంద్రుని ముష్టిఘాతంబు చవిచూచెదవుగాక.

(ఇరువురు యుద్ధమొనర్ప నింద్రుఁడు మూర్ఛిల్లును)

జయం—(ప్రవేశించి) వయస్యా! నీతగవు పాడుగాను. ఇంకనైన రావయ్యా. ఇంద్రుఁడు మూర్ఛదేరిన నేమగునో నాకు భయమెత్తుచున్నది.

కృష్ణు—జయంతా! ఇంద్రుఁడుగాదు. పదునాల్గులోకము లెత్తివచ్చినను మనకు భయములేదు. (ముందుఁజూచి) అదుగో! సురాచార్యులు వచ్చుచున్నారు.

జయం—అమ్మయ్యా! మా కులపురుగును జూచునప్పటికి నాకు ధైర్యము కలుగుచున్నది.

బృహ—వాసుదేవా! విజయము.

కృష్ణు—సురాచార్యులకు నమస్కారము.

బృహ—దేవా! నందనందనా! యీ యింద్రుఁడు నీభక్తావళిలోనివాడు. ఈతని గావఁదగును.

కృష్ణు—గీష్పతీ! ఇతని కృతఘ్నత జూచితిరా? మీరైన నుందలింపలేదేమి?

బృహ—ఇది యంతయు నారదునిరోషవాక్కులచే జనించినది. నా కిపుడీసంగతి శచీదేవి చెప్పెను.

ఇంద్రుడు—(లేచి) ఓరీ గోపాలా! వెన్నదొంగా! పోకుము, నిలువుము.

బృహ—ఇంద్రా. నీ కేమైన పిచ్చియా?

ఇంద్రు—(తేరిపార జూచి) గురువర్యా! మీ రిచ్చట కేలవచ్చితిరి?

బృహ—నీ విషయము దెలిసి వాసుదేవుని బ్రసన్నుని జేయవచ్చితిమి. ఇంద్రా! నారదుఁడు కలహప్రియుఁడని నీ వెఱుంగుదువు గదా! అతని మాటల నమ్మి యన్నివిధముల మనకాప్తుఁడగు శౌరితోఁ బగదలకొనుట యుక్తమా? ఈ మహనీయుఁ డెన్ని మేళుల మన కొనర్చెను?

చ॥ స్థిరముగ నాకమందు నివ♦సింపఁగ నోపక కానిక్రింతలన్
దిరిగెడు నిర్జరేంద్రునకు ♦ దీనతఁ బాపఁగఁ గాదె చక్రి యా
నరకునిఁ జంప నీజనని ♦ నావురుమంచనఁ గోడు వాపి నేఁ
డరయఁగ కుండలంబుల ని♦డన్నిఁక నేమిటికయ్య చెప్పుమా.

అట్టి యమరపతిపాలియగు ముకుందునితో జగడము స్వర్గనాశనహేతువుగాని యేమని తలంచితివి. ముందు మన కెన్ని కష్టముల నీశౌరి కావవలయునో దెలియునా. ఈ మహానీయునకీ పారిజాత మొకటికాదు. స్వర్గలోకపరిపాలన మొప్పగించినను జాలదు. లెమ్ము, కృష్ణపరమాత్మను రక్షింపవేడుము.

ఇంద్రు— గురువర్యా! నారదుని కలహనాటకమునఁ బాత్రనైతిని. మీ రనినమాట లన్నియు యథార్థములు: దేవకీనందనా! రక్షింపుము. శరణార్థిని.

కృష్ణు— నిర్జరేంద్రా!

చ॥ మనమున నుంచకయ్య యవ♦మానముగల్గెనటంచు నాజిలో
ఘనమును న్యూనమొక్కనికి♦గాక పరుం డెవఁడయ్య తొల్లిచే
సినసుకృతంబునన్ గలుగు♦శ్రీయును నాయువు గౌరవంబులున్
ననుఁ బెఱవానిగాఁ దలప♦నౌనె? త్వదీయుఁడ నేనుగానొకో

కావున

కం॥ మన్నింప వేడునాతఁడు
మన్నింపఁగఁ దలఁచునతఁడు ♦ మఱి యితరములా
నన్నియు బరమాత్మయె మన
కెన్నడు కర్తవ్యసరణి♦యే లే దనఘా.

యిదిగో నీపారిజాతము, గొనిపొమ్ము.

ఇంద్రు— మహాత్మా! పురాణపురుషా, ఈపారిజాతము నాకేల?

సీ॥ ఎవ్వని మాయచే ♦ నీలీల దేహంబు
కర్మఫలితమునఁ ♦ గల్గి కష్ట
సుఖములఁ నందుచు ♦ సుతసతీమిత్రాది
వర్గంబుచే భ్రాంతి♦వడసి ధనము

భూపశుగణములఁ • బొందుచు నలరారు
నా దేవు మాయచే • నవియు కొన్ని
వేళలఁ బోవున • విముఖత్వ మొనయంగ
కర్మపాత్రంబులఁ •గలసి మెలసి
నట్టి మిథ్యయగు ఋణానుబంధంబుల
కానఁగల్గి నిన్ను • నరయలేరు
భక్తలోకహృదయ•బంధు! కృపాసింధు!
విశ్వమయప్రదీప! • వేదరూప!

దేవా! ఇది నాయదియని పరిభ్రమించుచు కర్మజాలంబు పై నిడి చరించుజీవులభావంబులు ప్రళయామనస్కంమున నేమియగుట దలంపనోపరు మహాత్మా! నీవు సృష్టికిఁ బూర్వము నామరూపగుణములు లేనివాడవయి సృష్టిప్రసంగమున సత్త్వరజస్తమోగుణంబుల నలంకరించి విష్ణు, బ్రహ్మ, శివ నామరూపముల గైకొంటివి. నీమాయానాటకరంగంబున పాత్రలమైన మావినోద మెప్పటి కేరీతి నెంతయగునో యెఱుఁగ రాదుకదా. విశ్వకారణా! యిది నీయది కాని నాయది కాజాలదు నన్ను మన్నింపుము

బృహ—నారాయణా! ఈ యింద్రునికోర్కె నెరవేర్పఁదగినది.

కృష్ణు—మంచిది. సురగురూత్తమా! సెలవు.

(కృష్ణ సత్యభామా జయంతులు నిష్క్రమింతురు.)

[తెరవ్రాలును.]

4 వ రం గ ము

(తెరయెత్తగా సత్యభామమందిరోపవనభాగము పారిజాతముతో కృష్ణుఁడు, సత్యభామ, గర్గాచార్యులు, రుక్మిణి, జాంబవతి, బ్రాహ్మణుడు, జయంతుడు, కుటిల.)

గర్గా—(మంత్రములఁ జదువుచు) సత్యాదేవీ! ఈ యక్షతల నందఱకు బంచియిమ్ము

సత్యా—(అటు లొనర్చుచు)

గర్గా—నందనందనా! ఇచ్చట నీవు పాదు త్రిప్పుము.

కృష్ణు—(అటులచేయును)

గర్గా—సాత్రాజితీదేవీ! ఈ పారిజాతమును నాటుము.

సత్య—(అటులచేయును.)

గర్గా—(అందరివైపు జూచి) మీ రందఱు నక్షతలవేయుఁడు.
(అంౘఱు నటులొనర్ప మంత్రములతో ముగియును.)

గర్గా— దేవీ! వాసుదేవుని దయారసంబున నీ వన్నివిధముల ధన్య వయితివి సుమా.

కృష్ణు—నిజముగా! ధన్య యయ్యెను. సత్యాదేవీ! అనుకొనినటుల నీ యిష్టము పూర్తిజేసితిని. నీకు సంతోషముగదా.

సత్య—నాథా! నా కొక సంతోషముగాదు. సపత్నులందఱిలోమిన్న యగుపట్టపుదేవిననుగర్వంబున నలరు రుక్మిణికి గర్వభంగ మగుటొక సంతోషము. పారిజాతపుష్పమును దెచ్చి రుక్మిణి కిప్పించి అనరాని యవమానవచనంబుల బలికిన నారదు గర్వభంగమయ్యెగదా యని యొకసంతోషము. మీఁద నది సత్యభామ యెట్టికార్యమయినను పట్టుదలచే సాధించునని లోకము చెప్పుకొనుట యొక సంతోషము. శ్రీకృష్ణుఁడు సత్య భామావిధేయుఁడను వాడుక యొకసంతోషము నా కన్నిటను సంతోషములే.

జయం—(తనలో) ఓహో! పారిజాత మబ్బినంతనే సత్యాదేవి కెంత గర్వముకూడినది. కానిమ్ము జరుగవలసినది జరిగినది. దీని కేది యో యొకపన్నాగము సేయుచు భగవానుడగు శ్రీకృష్ణుఁ డాలోచింపకపోవడు. ఊరికి ఎంతనే పొద్దు గ్రుంకునా?

అందఱు—(మౌనముతో సభవిడిచి పోవుదురు.)

(ప్రవేశము: నారదుడు గానముతో)

నార—(గానము చాలించి) ఔరా, తా నొకటి దలచిన దైవ మొకటిఁ దలచునని నాఁడు పారిజాతపుష్పము రుక్మిణి కిప్పించినపుడు

యమున సత్యభామ నోనాడితినని పలువురిలో రుక్మిణిని నీస డించి కృష్ణుని సత్యభామావిధేయుని జేసి నాకు గర్వభంగ మయ్యెనని వచించెనే ఆసత్యాదేవి నాకు గర్వభంగ మయ్యెనని వచించెనే!! ఆ సాత్రాజితీదేవి నాకు గర్వభంగ మయ్యెనని వచించెనే!! (ఆగి) కానిమ్ము. ఇంతమాత్రమునకై చింతింప నేటికి? ఆయిందునకు గర్వభంగమయ్యె, నదియే ముఖ్యము. ఇఁక నీ సత్యభామాదేవిని ద్వారకావీథులయందు నా గర్వ భంగమును గూర్చి ముచ్చటించిన పలువురలోఁ గృష్ణుని భక్త విధేయుని జేసి రుక్మిణిని భక్తశిఖామణిని జేసి పలుపాటు లందింపకుండిన నే కలహాభోజనుఁడనను నామము పరిహరింప కుందునే! ఇందులకు దయామయుండును భక్తజనేప్సితానుకూ లుండును నగు వాసుదేవుండు సాయ మగుగాక.

(నిష్క్రమించును.)

గద్య

ఇది శ్రీ వేదశైల లక్ష్మీనృసింహ కరుణాకటాక్ష వీక్షణ లబ్ధ కవితా మధురభాగధేయ సూరిజనవిధేయ యేజెళ్ల వేంకట సుబ్బయ నామధేయ ప్రణీతంబైన సాత్రాజితీ గర్వభంగమున తృతీయాంకము.

---



శ్రీ

# సాత్రాజితీ గర్వభంగము.

## చతుర్థాంకము.

### 1 వ రంగము

[సత్యభామ మందిరము: సత్యభామ కుటిల]

సత్య—కుటిలా! ఎన్ని దినంబులని సహింతునే. నేటికి మాసమునుండి నా గృహమునకే రాడయ్యెగదా. ఒకవైపు పారిజాతవృక్షమొకటి దొరికిన దని సంతసించుసరికి ప్రియవియోగము దాపురించె. కృష్ణుఁడేమైన నిన్ను బలుకరించెనా?

కుటి—అమ్మా! ఆయన పలుకరించునని తలంచినమాత్రమున నీ సవతులు పలుకరింప నిచ్చునటుల లేదు.

సత్య—వారి మాటలకే చెవియొగ్గుచుండెనా?

కుటి—చెవియొగ్గుట మాత్రముకాదు - వారి యాజ్ఞలేనిదే మాట్లాడుటకైన కృష్ణుఁడు స్వతంత్రించుటలేదు. ఇంక నీ గృహమునకు వచ్చునను కొంటివా యేమి? ఆయనమతియంతయు మారినది.

సత్య—ఏమి కారణమై యుండనోపును?

కుటి—కొంచెము మందేదియో నడిపించినట్లున్నది.

సత్య—నామదికి నదియే యనుమానము.

కుటి—కాకున్న నిన్నిదినము లారుక్మిణిగృహంబున నెన్నడైన నుండెనా ?

సత్య—మన కాపుండు నోనఁగి పుణ్యముఁ గట్టుకొనువార లెవరైనఁ గలరేమో విచారింపుము.

కుటి—అటులనే యొనరింతము లెమ్మా.

(లోపల గానము)

సత్య—ఎవరో ముని వచ్చుచున్నట్లున్నది.

కుటి—ఆయన నారదుఁడు కావచ్చును.

[నారదుఁడు ప్రవేశించును]

సత్య—(నమస్కరించి) మునిచంద్రమా! యీ పీఠ మలంకరింపుఁడు. తమ దర్శనభాగ్యము లభించి చాలదినంబు లాయె

ఉ॥ తాపనచంద్ర! నామది ముదంబు వహించె, భవత్సమాగమ
వ్యాపకమైన మద్గృహము పావన మయ్యె, తరించె జన్మ, సం
తాపము వోయె, కోర్కులవిధానము నేఁడు ఫలించె, పూర్వపుం
బాపము లూడె మీరిటకు వచ్చుటభాగ్యములొప్పెనిప్పుడున్.

నార—(తనలో) ఓహో, సత్యాదేవి హృదయము నేఁడు వినయంబును బ్రసాదించుచున్నదే. కానిమ్ము, నా తలంపునకు సానుకూలమైనది. (ప్రకాశముగా) సత్యాదేవీ! సంతోషమా.

సత్య—మునీంద్రా! ఏమని చెప్పఁగలను. దినదినగండము-వేయేండ్లా యుష్య మన్నటు లున్నది నా క్షేమముల తెరవు.

నార—సాత్రాజితీ! ఏమట్లు పలికెదవు?

సత్య—ప్రాణేశ్వరుని ప్రేమయే కారణము.

నార—మొన్ననే కదా పారిజాతము తెచ్చియిచ్చినది!

సత్య—అదియే తుదిసంతోషము.

నార—శౌరి నీ యం దనురక్తుఁడు కాలేదా? నీమేలు నాలోచింపఁడా యేమి?

సత్య—

చ॥ మునివర! యేమిమేలులని ముద్దుగఁ జెప్పుదు శౌరిమాయలం
దునబడి మోసపోయితిని • తోయజనేత్రలఁ జేరి నన్ను హే
ళన లెకసక్కెముల్ బలుకు•లా గొనరించు నదేమిచిత్రమో
వనితలు మందుల౯ దమకు • వశ్యుఁగఁ జేసిరొ యేమిచేసిరో.

సర్వవిషయములు మహాత్ములగు మీకు గోచరమగుచుండును. గోపాలుని బందిగాఁ జేయు వ్రతమైనను జపమైనను మంత్రమైనను మందైనను నున్న వచియించి సవతులలో కెల్ల నన్ను మిన్న యగునట్లు సేయ మీ పదము లంటివేడెద, నెఱింగింపుఁడు.

నార—సత్యా! గోపాలుని వశునిజేయఁగల వ్రతమంత్రము లున్న వచియింపవలయునా? (ఆలోచించి) ఔను, జ్ఞాపకమునకు వచ్చినది. పూర్వము శచీదేవి యహల్యాజారునకై పుణ్యకవ్రత మనునొకదాని నొనర్చి కృతార్థురాలయ్యెను. అయ్యది నీ వాచరింపఁగలిగిన నీ కోరికలు సిద్ధించును.

సత్య—అది యెవ్విధముగాఁ జేయవలయును?

నార—మంచి శుభలగ్నమున బ్రాహ్మణుల రావించి— (ఆగి) ఏమో నీ వాచరింపఁజాలనట్లున్నది.

సత్య—మునీంద్రా! అమృతమైనను దెప్పింతును.

నార—వలదు. అది నీచేతిలోని పనియే.

సత్య—అటులయిన సంశయమేల?

నార—రుక్మిణి విఘ్నమొనర్చునేమో యని.

సత్య—ఆమె నడుగవలసిన దేదియైనఁ గలదా?

నార—నీ నాథుని మాత్రమే.

సత్య—అయినచో సఫలమైనట్లే.

నార—ఆయనమాత్ర మందులకీయకొనునో లేదో.

సత్య—ఏమిచేయవలయు?

నార—దాన మీయఁబడవలయు.

సత్య— (సంశయముతో) దానమా! భర్తృదానమా!

చ॥ జగతిని బెక్కు మానినులు•నల్పరె? జన్న ములుఁ వ్రతంబులుఁ
దగువిధమొప్పగాధనము • దానముసేయరె? భూమి లీయరే
నగల నొసంగరే వితర•ణంబున; నిట్టులదిట్టలై ధరఁ
మగలను దానమీయ జగ•మందునజూతుమె? మానిచంద్రమా!

నార—వ్రతమునందే నమ్మకములేనియెడ ఫల మెట్లు లభించును?

సత్య—మునీశ్వరా! పతిప్రేమకొరకై యాచరించువ్రతమునఁ బతిని
నితరులకు దానమిచ్చి యనుభవించు సౌఖ్యము లేమిగలవు?

నార—ఓహో! యిదియా నీ సంశయము. పతిని మరల గ్రహింప
వచ్చును.

సత్య—ఎట్లు?

నార—మగనియెత్తు ధనముగాని ధనేతరముగాని యిచ్చి.

సత్య—ఇదియా. అట్లు లయినఁ గావలసినంతధన మున్నది. మన
కెందునుఁ గొఱత లేదు.

నార—సత్యాదేవీ! ముందుగా జెప్పుట మంచిది. నీమగని దూచు
ధనము నీయెడ నున్ననే యీవ్రతమున కుపక్రమింపుము.

సత్య—శమంతకరత్నజాతంబగు బంగారము కుప్పలైయున్నది.
ధనముచాలకున్నను ధనేతర ముపయోగింప వచ్చుగదా?

నార—అవును. నీకు నమ్మక ముండిననే వ్రతము ఫలిత మొసంగును
సుమా.

సత్య—వ్రతమునం దలత్స్యము లేదు.

నార—ఇఁక నెందుల కాలస్య మొనరింతువు?

సత్య—నా నాథున కీ విషయము దెలిపి సమ్మతింపఁ జేయవలయుఁగదా.

నార—రుక్మిణి మొదలగు నీ సవతుల కెఱిఁగింపకుము. వారు కార్య
భంగ మొనరింతురు.

సత్య—తెలియకుండగనే సమాప్తి గావింతును. కాని యెవరికి దాన మీయవలయును?

నార—సర్వవిజ్ఞానపరిచయుం డగు నే మునికైన పారిజాతవృక్షము నకు కృష్ణుని బంధించి దాన మొసంగిన నటులే భార్యాభర్త లన్యోన్యప్రేమంబున విరాజిల్లుచుందురు.

సత్య—అటులయిన నాదానము మీకే నీయ నిశ్చయించితి.

నార—నేను సత్యలోకప్రయాణము దలపెట్టియున్నానే.

సత్య—నన్ను మన్నించి యీవ్రతసమాప్తి యగువరకు నిందే యుండ గోరెదను.

నార—ఇఁక నీ మాట కడ్డుజెప్పకయుండవలసివచ్చినది.

సత్య—ఇంతటి వాత్సల్య ముండుటకు ధన్యను.

నార—అటులనే కానిమ్ము.

సత్య—కుటిలా! సురమానీంద్రునిమాటలు వింటివికదా. వ్రతము నకుఁ గావలయుయత్న మొనరింపుము.

కుటి—చిత్తము. (తెరవ్రాలును)

(ప్రవేశము : కృష్ణుఁడు, జయంతుఁడు)

కృష్ణ—జయంతా! సత్యాదేవిమందిర మిట్లు చిన్నవోయి యున్న దేమి?

జయం—వయస్యా! రుక్మిణీదేవిగృహమున నున్నపు డొకసారియైన జ్ఞాపకమునకురాని సత్యాదేవిమందిరము ఆమె వాకిటదరి జేరగనే కాంతివిహీనమై కళావిహీనమై యున్నటులఁ గాన్పించు నేమయ్యా.

కృష్ణ—సరిలే. బిగ్గరగా మాట్లాడకుము.

జయం—నా కేమైన భయ మనుకొంటివా?

(ఇద్దఱు నడువగా తెర యెత్తబడును. సత్యభామ మందిరము: పాన్పుపై
బరుండియుండిన సత్యభామయు, విసరుచు ప్రక్కన నొక
మేజాపై గూర్చుండిన కుటిలయు)

కృష్ణు—కుటిలా! సత్య నిద్దురబోవుచున్నదాయేమి?

కుటి—(లేచి) అవును. ఇప్పుడే నిదురించినది.

కృష్ణు—(సత్యభామయొద్దకు పోయి మెల్లగా ముసుఁగుదీయును.)

సత్య—(మెల్లగా లేచి) ఓహో! రుక్మిణీప్రణయానందలహరీ శౌరీ! మీరా? ఇదియేమి? పొరబడితిరి కాబోలు. ఇది రుక్మిణి గృహసీమ కాదు. నేను రుక్మిణినిగాను. కుటిలా! వీరికి రుక్మిణీ సౌధంబునకు దారిజూపి రమ్మి.

కృష్ణు—సత్యాదేవీ! నిదురకంట మాటలాడుచుంటివా?

సత్య—కండ్లు తెఱచియే పలుకుచుంటిని.

కృష్ణు—ఏమని?

సత్య—నీ ప్రియబంధువుల దర్శింపఁబోవుమని.

కృష్ణు—పిచ్చిసత్యా! నీవుగాక యెక్కుడగు బంధువులు నాకెచట గలరు?

సత్య—అవును, కావుననే నా కోర్కెలన్నియు దీర్చుచుంటిరి.

కృష్ణు—ఏలా మానితినా? మొన్నగదా సురనగరమునకు నిను గొంపోయి పారిజాతము దెచ్చియిచ్చితిని.

సత్య—ఆహా! నూటికి నూలుపోగనినట్లు నాఁటినాఁటి కెటులో నేఁటికి పారిజాత మొకటి దెచ్చియిచ్చితిరి దానికే వేయిసారులు పొగడుకొనుట ఈ పొగడ్తలలో నది ఫలితమునకు వచ్చిన సంతోషమే.

కృష్ణు—ఏమైన కొదుపగలదాయేమి? చెప్పుము, పూర్తిజేతును.

సత్య—అన్నియు పూర్తిగావించినటుల నదికూడ సఫలము జేయఁ దలఁచితిరిగాబోలు. అంతగా ప్రేమలేనివార లూరకుం

జరు. అది యిచ్చెద నిదియిచ్చెద నని ఫలితలేశము లేని వరములు.

కృష్ణు—సత్యాదేవీ! నే నని నమాట దప్పియుంటినా?

సత్యా—కుటిలా! నీయెదుట వీ రెన్నిసారులే యిటులాడుచుండుట?

కుటి—అప్పు డప్పు డిటులే పలుకుచుందురుగాని నే జూచినంతలో కార్య మొనగూడిన ట్లెఱుంగను.

జయం—ఓహో! నీవు సత్యాదేవి దాసివి కావు!

కుటి—నీవు వాసుదేవుని చెలికాఁడవైనట్లు నేను సత్యాదేవిచెలి కత్తియ నైతిని.

కృష్ణు—జయంతా? యెన్నడైన నేనాడితప్పియుండఁగా వినియుంటివా?

జయం—అబ్బే! లేదయ్యా.

సత్యా—(జయంతుని వైపుజూచి) నిజముగా లేదా?

జయం—అవునమ్మా! మరచితిని. ఎప్పుడో కొంచెము ...

కృష్ణు—జయంతా! నీ ధర్మము బాగున్నది.

జయం—మీ వధూవరు లన్యోన్యులై సుఖముగా నుండవలె, మధ్య నీ బీదబ్రాహ్మణుఁడు ధర్మము వ్యక్తీకరించి పగవాఁడుకావలె అందులకే, ఎవరికి కోపము రాకుండ జెప్పితిని.

కృష్ణు—సాత్రాజితీ! జయంతుని హాస్యమున కేమి గాని నీవు గావల సినదాని నడుగుము. నెరవేర్తును.

సత్యా—నిజముగా నొనగూర్తురా?

కృష్ణు—పారిజాతాపహరణము వంటి కోరికమాత్రము కోరకుము.

సత్యా—నాయిష్టమైనది కోరుదును.

కృష్ణు—నీయిష్టము వచ్చినదియే కోరుము.

సత్యా—నిజముగా!

కృష్ణు—సత్యము.

సత్య—చేతిలో జేయివేయుఁడు.

కృష్ణు—(అటుల నొనర్చును)

సత్య—మిమ్ముల నొక మునికి దాన మీయ నిశ్చయించితి.

కృష్ణు—దానమా! మగనిని దానమా!! సత్యా! ప్రాణేశ్వరుని దాన మిచ్చి యేమిసౌఖ్యము లనుభవింపఁ దలంచితివి?

సత్య—మరల గ్రహింపవచ్చునుగదా!

కృష్ణు—ఎట్లు?

సత్య—మిమ్ముఁ దూచఁగల ధనము నొసంగి.

కృష్ణు—నన్ను దూచు ధనము నీ కడఁగలదా?

సత్య—కావలసినంత కలదు.

కృష్ణు—యువతీ! బాగుగా నాలోచింపుము. అట్టిధనమే నీయొద్ద లేకున్న మునికి దాస్య మొనరింపవలసివచ్చును.

సత్య—ధనము జాలకున్న ధనేతిరమేదియైన నుపయోగింపవచ్చును.

కృష్ణు—(తనలో) ఇది నారదుని కలహానాటకము. సత్యాదేవికి గర్వ భంగ మొనర్పఁ నెంచి చేసినట్లున్నది. కానిమ్ము. (ప్రకాశము) సత్యా! యీ వ్రత మెఱిగించిన దెవరు?

సత్య—నారదమహర్షి.

కృష్ణు—ఓహో! నారదమునీంద్రుఁడా! అటులయిన వార లెఱుంగని యంశము లుండవు. నీయిష్టము వచ్చినటులఁ గావింపుము.

సత్య—జయంతా! నీ వేగి మన గురువరులగు గర్గాచార్యుని దోడ్కొనిరమ్ము. ఇతరుల కీవిషయ మెఱింగింపకుము.

జయం—దేవీ! యితరుల కెవరికిఁ జెప్పకతప్పినను మాయింటి యాఁడు దానికి మాత్రము—

సత్య—చెప్పెదవా యేమి?

జయం—అది యితరులకుఁ జెప్పదులే. (నిష్క్రమించును.)

(తెరవాలును.)

[తెరయెత్తగా సత్యభామ మందిరాంతర్భాగము. కృష్ణుడు సత్యభామయును పీటపై కూర్చుండియుండ నారద గర్గ జయంతులు కుటిలయు సమీపమునఁ గూర్చుండియుందురు.]

గర్గా—(మంత్రము జదివి) సత్యాదేవీ! నీ నాధుని పారిజాతమునకు బంధించి నారద ఋషీంద్రునకు దాన మొసంగుము.

సత్య—(అట్లుచేసి నారదున కొసంగును)

నార—(గ్రహించి)

గీ॥ వడుగఁడయి బలిని మున్ను మూఁడడుగు లడిగి
వెలయ దానంబుగొన్న త్రివిక్రముండు
నేఁ డొకలతాంగిచేత మునీంద్రునకును
దాన మీయంగఁబడెను చోద్యంబుమీర.

సత్య—మునీంద్రా! వ్రతసమాప్తియైనదా ?

నార—నెరవేరినది.

సత్య—ఇఁకఁ జేయవలసిన దేమి ?

నార—నీనాథుని, సమమైన ధనము నొసంగి పునః పరిగ్రహింపుము.

సత్య—జయంతా! నీ వేగి త్రాసును దీసికొనిరమ్ము.

జయం—అబ్బా! న న్నేమి యూరకుండ నిచ్చునటుల లేదే (నిష్క్రమించి త్రాసుతో ప్రవేశించి యొకచోట కట్టును.)

నార—సత్యాదేవీ! ధనము దెప్పింపుము.

సత్య—కుటిలా! నీ వేగి మన యింటియందుఁగల ధనము దెచ్చి త్రాసునం దుంపుము.

నార—జయంతునికూడ పంపుము.

సత్య—ఇందరు కావలయునా?

(కుటిల కొంతధనము దెచ్చి త్రాసునం దుంచును.)

నార—వాసుదేవా! నీ వీత్రాసునందు గూర్చుండుము.

కృష్ణు—(అట్లు కూర్చుండును.)

నార—సత్యాదేవీ! యింకఁ గొంతధనంబు దెప్పింపుము.

సత్య—కుటిలా! శమంతకజాతంబగు బంగార మంతయు దెచ్చి యీ త్రాసునం దుంపుము.

కుటి—(అటులఁ జేయ త్రాసు కదలకుండును)

సత్య—(ఆశ్చర్యముతో) ఇది యేమి! యింత ధనంబు వైచినను కృష్ణుని దూఁగఁజాలకున్న దే! కుటిలా! మన ధనాగారంబునఁ గలధనము దెచ్చి త్రాసునం దుంపుము. (కుటిల అటుల జేసినను ఫలితము లేకుండును). కుటిలా! నాతండ్రియగు సత్రాజిత్తు నరేంద్రునిచే అరణముగా నివ్వబడిన హేమమంతయుఁ దెచ్చి త్రాసునం దుంచుము. జయంతా! నీవును గుటిలకు సహాయుండవుకమ్ము!

(కుటిల జయంతు లట్లు చేసినను. కృష్ణుని వైపు లేవకుండును)

(తెల్లపోయి) మునీంద్రా! యిది యేమి మాయ. నా సౌధ మందుఁగల యింత ధనంబు వైచినను నాథుని దూపజాలకున్న దేమి?

జయం—దేవీ! యీ మాయ నేను గ్రహించితిని. రాక రాక వచ్చె గదాయని రాత్రి నీవు చేసిన భోజనఫలాహారము లీయనయుద రమున నుండి జీర్ణము కాకపోవుటచే ఇంత ధన మిడినను లేవ కున్నారు. ఈ పూట కిది యాపి వైద్యుని బిలిపించి యొక విరేచనమాత్ర నిచ్చితివేని మందము వదలి తేలికగాఁ దూగును.

నార—జయంతా! యిది యొకవిధమైన సదుపాయమే!

సత్య—తాపసాగ్రణీ! ధనము చాలకున్న ధనేతర ముపయోగింప వచ్చునుగదా?

నార—అవును.

సత్యా—కుటిలా! జయంతా! మీరు మనసౌధమందుగలవస్తునికరం బులదెచ్చి యీ త్రాసునం దుంపుఁడు. (జయంతకుటిలలు నిష్క్రమించి వస్తువులదెచ్చి త్రాసునం దుంచిన ఫలితము లేకుండును)

సత్యా—(విచారముతో) తాపసాగ్రణీ! యిది యేమిమాయ. నాయింట గల ధనకనకవస్తువుల నన్నియును నాధునీ దూపజాలకుండె నేమి!

నార—సత్యాదేవీ! యిదియేమో చిత్రముగానే యున్నది. ఇంక నేవిధ్యైనఁ గలిగిన నుపయోగింపుము.

సత్యా—(ఆలోచించి) మునీంద్రా! యిఁక నాశరీరమున నున్న వస్తువులు దక్క నన్నియుఁ ద్రాసునందే కలవు. కానిమ్ము. ఇవియును నుపయోగించి చూచెదగాక (అని తనమేన నున్న సర్వాభరణములఁ దీసి త్రాసునం దుంచును. త్రాసు కదలకుండును.)

సత్యా—తాపసవర్యా! యిఁక నేమిచేయు మనియెదవు.

నార—అమ్మా! యింతమాత్రమున కే చేయు నుపాయములు లేకున్నవా? నీయెడ నింక కొంతధనము లేకుండెనా? కృష్ణుని దూచుధన మన్న నెంతయని యంటివే? ఇప్పుడు ధనమే లే దనిన నే నెట్లు నమ్మగలను?

సత్యా—మునిచంద్రమా! యిది యంతయు నాకు గారడివిధముగా నున్నది. ఈ ధనములు, నీ బంగారము, నీ వస్తుజాలములు కృష్ణుని దూచుటకుఁ జాలనివని చూచువార లెవ రనుకొన గలరు? నా గృహ మంతయు కడిగి ధనకనకవస్తువుల నిడితిని. ఇంక నెక్కడ గలదు?

నార—లేకున్న నీ కీ కృష్ణు డవసరములేదా!

సత్యా—అట్లందు రేల?

నార—ఏమనవలయు?

సత్యా—ఇంతధనము గైకొని నా నాథుని నా కివ్వరా?

నార—ఇది యెంతధనము?

సత్య—లెక్కకు వచ్చునదియా?

నార—నీకుమాత్రము?

సత్య—మీ కేల కాగు?

నార—కృష్ణునిఁ దూచగలిగిన ధనమే నాకు తృప్తి.

సత్య—అటుల గానిచో?

నార—కృష్ణునిఁ దూచగల ధనమిచ్చువారి కప్పగించెదను. లేదా కృష్ణుని నాసేవకునిగా నుంచుకొనియెదను. కృష్ణా! లెమ్ము. మన మీ బసిరి కావనుఖుం చూతుము పురాణములఁ జెప్పుచుండె నట! అట కేగుదము,

కృష్ణ—తపస్వీ! యిది యేమి చేత? ననిపుముని కప్పగింతువా యేమి?

మ॥ అలనాఁడే వ్రతమాపు తెల్ప నని జంకక ధైర్యము ల్సెప్పి యో లలనా! యేదియొ యిచ్చి కొను మనని యేలా ఎన్న మోసంబునన్ జలజాతాననసూనృత దాస్యగుణవర్తనన్ సాధించినావా పిల్లు? యన్యుల పాల్సేయు టనీకు పాడియగునో యుత్సాహమో చెప్పుమా!

నార—కృష్ణా! నెనరగినదానికిఁ జెప్పవలసినదిగాని భార్యాభర్త లేకమైతిరా యేమి? నీవు నాకమీయాబడలేవా? వచింపుము. నాదారిని నేను బోయెదను.

కృష్ణ—దేవమునీ! నిజము నెట్లు కాదనగలను.

నార—అటులయిన లెమ్ము. ఇదిగో నాకమండలువు. దీనినిఁ జేత బట్టుకొనుము. ఇది నాయోగదండము. ఇవి రుద్రాక్షమాలలు, ఇవి నీమెడవైచికొనుము. ఇదిగో పులిచర్మము, వీపున నుంచుకొనుము. రమ్ము.

సత్య—మునీంద్రా! ఇట్టి యన్యాయమునకుఁ బొల్పడితిరేమి?

నార—సాత్రాజితీ! యింద దన్యాయమేమి గలదు?

సత్య—నా నాథుని నేమి జేసెదరు?

నార—అమ్ముకొనియెదను.

సత్య—మీ కిది న్యాయమా?

ఉ॥ మానివరేణ్య! మున్ను శుభ • మార్గము లేపిరయి తెల్పుచున్న నీ
మానసమందు కల్మష క్ర • మంబును దాచి వ్రతంబు జెప్పి నే
డీ నిఖిలప్రజాముఖసి • హేళన జేయుచుఁ గృష్ణునమ్మఁగాఁ
బూనెద వేమి న్యాయ మిటు • బొంకులు పల్కుట మీకుఁ బాడియే!

ముందుగనే యిటులగునని సెప్పిన నేనీ వ్రతమునే మాను కొందునుగదా.

నార—సాత్రాజితీదేవి! నావలన నెట్టిదోషంబును లేదు.

మ॥ పతిఁ దూచంగల దెద్దియైన నిడి నీ • ప్రాణేశు గైకొమ్ము నా
కితరంబుల్ పని లేదు; నాఁడిటులుగా • దే చెప్ప నభ్భాగ్యపున్
స్థితి యెప్పాటి దటంచు బల్కితివి యీ • చిత్తంబు లేదా? తదీ
యతరంబైనను కుందుఁ డెంతబరువో • యాలోచనల్ సేయుమా॥

కృష్ణా! సత్యభామ నిన్ను గ్రహింపజాలదు రమ్ము. నాకు సత్యలోకమున నవసరమగు పని కలదు.

కృష్ణ—లలనామణీ! యిక నాయాశ లడుగంటినట్లు లేనా? నన్ను దూచ గల పదార్థమేదియు లేదా? ఈ మునికి దాస్యము చేయవలసిన దేనా? ఏ మట్లూరుకొనెదవు? అయ్యో!

ఉ॥ మానిని! నిన్నువంటిపది • మంది సతీమణు లిండ్ల దాస్యముం
బూనినగాని మానసము • పొంగును మానిపదాబ్జసేవక
త్వానిపుణంబు మైకొన స • దా మునిరీతి నటింప గోరునో
కానల నుండుమంచనునొ • కాదనునో మరి యేమి పల్కునో

ఈ మునీంద్రుని దాస్యము నాకు మిగుల భయమును గల్పించుచున్నది. కావున నెన్నిదినములకైన నన్ను విముక్తుఁ జేయు మార్గ మాలోచింపుము.

(నారదుని వెంబడి నిష్క్రమించును)

గద్య:

ఇది శ్రీ వేదశైల లక్ష్మీనృసింహ కరుణాకటాక్షవీక్షణలబ్ధకవితా
మధుర భాగధేయ సూరిజనవిధేయ యేజెళ్ళ వెంకటసుబ్బయ
నామధేయ ప్రణీతంబైన సాత్రాజితీ గర్వభంగమున
చతుర్థాంకము.



శ్రీ

# సాత్రాజితీ గర్వభంగము.

## పంచమాంకము

### 1 వ రంగము

[ద్వారకానగరవీధి - కృష్ణునితో నారదుఁడు]

నారద—ఓ ద్వారకానిలయులారా! పుణ్యులారా! రండు. మంచి చౌకబేరము రండు. ఈ మహనీయుని కొనుండు.

సీ॥ ఈతఁడే నాఁడు వి◆ధాతకు వేదముల్
దయనిచ్చినట్టి యు◆ద్ధచరితుండు
ఈతఁడే యమరుల ◆ భూతికై గిరిజులఁ
జక్కాడినట్టి మ◆జ్జగయశుండు
ఈతఁడే శరణన ◆ నిభరాజుఁ గాచిన
భక్తవత్సలనామ◆ప్రభువరుండు
ఈతడే రాతిని ◆ నాతిగాఁ జేసిన
మహిత మహామహి◆మాన్వితుఁడు
ఈతఁడే భక్తచింతామ◆ణీతఁడే సు
జనవశుండును సత్త్వర◆జస్తమోగు
ణంబులను నలరారుబ్ర◆హ్మంబు నితని
ధనము వెచ్చించి కొనరయ్య ◆ ధన్యులార.

సత్య—(ప్రవేశించి) సురమునీంద్రా! నన్ను నలువురిలో నరాభవ మొనర్పఁ దలకొంటిరా?

పాదపవృత్తము.

తాపసచంద్రమ! దంపతులా మ
మ్మాపగిది న్నెడమేల నొనర్ప
న్నాపనగా తమప్రాపును గోరం
గా శతి నీయక తాదసనేలా.

నారద—సత్యాదేవీ! నాకు పాపము కూడ నెత్తినిఁ బెట్టుచుంటివా? ఈ వ్రత మాచరించుట నామేలునకేనా? సరి సరి; అమ్మాయీ! ఆనాఁడు.

ఉ॥ ఎవ్వనిఁ ద్రాసునం దునిచి యిచ్చెదఁ దత్సమమైన తాసులో
గవ్వలొయుంచు బల్కిన ముఖాముఖమాటలు రిత్తఁ జేసెదే
యివ్వనజాయతేక్షణుని కీడగుసొమ్ములు నీయకున్న నే
నెవ్విధినైన నమ్మఁగొననే? ధన మెవ్వరికేని సేగియే?

సత్య—నాకుఁ గలధన మంతయు నొసంగెదనంటిగదా.

నారద—నీ ధన మెవరికి గావలయును?

సత్య—ఏమి గావలయును?

నారద—శ్రీకృష్ణునిఁ దూచగలిగిన దేదియైనను సరియే.

సత్య—అట్టి వస్తువులే నా యెడనున్న మిమ్ము నిట్లేల బతిమాలవలయును.

నారద—ఓహో! అందిన జుట్టు నందకున్న కాళ్లునా!

జయం—(ప్రవేశించి) మా యింటియాడుదిమాత్ర మట్టులే యొనర్చును.

సత్య—(కృష్ణునివంక తిరిగి) నాథా! నన్ను మన్నింపరా?

కృష్ణ—సాత్రాజితీ! నన్నగతాళిఁ జేయుచుంటివా యేమి? బుద్ధిపూర్వకముగా నొప్పుకొనినందుల కింత జరిగెగదా యని

చింతనందు నన్ను మన్నింపుమని హేళన లాడుచుంటివా? మీా పలుకులు తిలకించిన నీవును, నారదుఁడునుఁ గలిసి నన్నిటుఁ జేయఁబూనితిరని తోఁచుచున్నది.

సత్య—(తలవంచి తనలో) అకటా! ఏమి సేయుదును. నా జీవిత పథమునకు ముందునూయి, వెనుకగోయియును తటస్థించినవి. ఒకవంక బెదరించు మునీంద్రు నెటుల సమాధాన పరతునా యని ప్రాణేశ్వరునిఁ బ్రార్థింప నన్నిమునికర్పించెదవాయని ప్రాణేశ్వరుడన సాగె. ఇదివినిన నా సవతు లేమందురో, నా యత్తమామ లెంతకఠినముగ దూరుదురో, బలభద్రుఁడు సాత్యకి మొదలగు యదువరు లెంతదండింతురో కదా! ఇప్పుడేదియు నాకు గోచరించుటలేదు. కానిమ్ము. ఎట్లైన ప్రాణేశ్వరునే ప్రసన్నుని జేసికొనవలయును. (ప్రకాశముగ) నాథా! తెలిసీ తెలియక నా యావివేకమును మన్నింపరా!

జయం—సత్యాదేవీ! నేటికా నీనోట రక్షింపుమని ప్రాణేశ్వరునివేఁడు పలుకులు వినఁగల్గుట! అమ్మా! ఈ వినయములు నీమన్ననలు,

ఉ॥ జంకక పూవు రుక్మిణికొసంగిన • మాయెనవంపుచేత లీ
వంక నటింపనేరవని • వారిజలోచనుఁ గూర్మి వామపా
దాంకమునన్ బరామరిక • నాదల నిల్పెడునాడు యేనదిన్
గ్రుంకినదమ్మ నీనుడువు • కూరిమి నేడిటుగల్గె నక్కటా.

కృష్ణ—దేవీ! నన్నిట్లు నిష్ఠురము లాడిన నేమనఁగలను. అకటా! యిక నాకీ మునిదాస్యము తప్పదు కాఁబోలు.

నారద—కృష్ణా! యింతటినుండి నీ వీ సత్యాదేవితో మాట్లాడవలదు, రమ్ము. (నిష్క్రమింతురు.)

సత్య—అకటా! సత్యాదేవీ! నీజీవితము నెంత నీచముగ నొనర్చితివి. సవతులందరి కొకగడియ యుండినమాత్రంబున ననూయా పతివై యుపకతపకలకు నీ హృదయము నీ హృదయచకో రమును నీ సెన్నిధిని చేసేత నొక బడుగుతాపసికి చిరకాల

దాసునిగా నొనర్చితివే, ఇపుడేమి సేయగలవు. ఛీ! నీ జీవిత మింతయేనా? హా! (నిష్క్రమించును.)

(ద్వారకానగరమందు మఱియొక వీధి: కృష్ణునితో నారదుడు.)

నారద—ఓ ద్వారకాపౌరులారా! రండు. ఈమహనీయునిఁ గొనుఁడు (ఆలకించి) ఆ! యితఁడెట్టివాఁడ నుకొన్నారా? వినుఁడు. ఈతడు

గీ॥ కోరిభజియించునారి కిం ♦ గొంగుపసిఁడి
కేరి పిలిచెడివారి పా ♦ లికృష్ణధనంబు
వలచి స్తుతియించువారికి ♦ వశ్యుఁడితని
ధనమునం దూచి కొనఁ దయ్యె ♦ ధన్యులార!

[ప్రవేశము: సత్యభామ జయంతుఁడు]

సత్య—మునీంద్రా! నన్ను రచ్చకీడ్చితిరే! తాపసోత్తములుగదా! మీ రిట్లు చేయఁదగునా! నే నడిగిన మాత్రమున నిట్టి వ్రత మేల యుపదేశింపవలయును ఈ విషయము నేల వచింపకుంటిరి.

నారద—సత్యాదేవీ! నీ కిదియే పిచ్చియా! ఎంతమంది యిటువంటి వ్రతము లాచరింపలేరు. నీవడిగిన చొప్పునఁ జెప్పుటయు నాకు గల నేరమా? జగన్నాథుతో పాటుగాక నీ మగడింత బరు వుండునని నాకెట్లు తెలియును? అది నీవే గ్రహింపవలసి యుండును.

సత్య—తెలియక యొనర్చిన నా యవివేక మింతట మన్నింప వేడుచుంటిగదా! మీకేల కరుణ రాదు? ఈ విషయంబు నా సపత్నుల యెదుటఁబడిన నా కెంత చిన్నదనము కల్గునో తలంపుఁడు. మునీంద్రా! నన్ను మన్నింపుడు. ఈ మాయను జాలింపుడు.

జయం—సాత్రాజితీ దేవీ! నీ పిచ్చి పాడుగాను ఇంకను మాయ మాయ యని వచింతు వేమమ్మా! ఇది మాయగాదు, మహిమ.

సత్య—నాథా! నన్నుఁ జేరవరా? అమాయికత్వమునఁ దెలిసి తెలి యక యొనర్చిన చేతల కిట్లు నలువురిలోఁ బరాభవము జేయుట కన్న మీరే నన్ను గద్దించిన బుద్ధి వచ్చునుగదా. నన్ను మన్నింపుఁడు. (అని పాదములఁబడును.)

కృష్ణు—యువతీశిరోమణీ! అది నావలన గాఁగల కార్యము కాదు. అందును మౌనికి దాసుండను. నే నేమియు వచింపదగదు కావున నారదమునీంద్రు నే ప్రార్థింపుము.

సత్య—(లేచి) సురముని యిందో శ్రేష్ఠుఁడా! న న్నేల రాఁపులపాలు జేయఁ దలంచితిరి? నా తప్పులకొక నేమిశిక్ష నను భవింపజేయఁ దలంచితిరి. మీరు జనకులు నేను కుమార్తెను. పుత్రిక తప్పులు దండించి మన్నింపవలయునుగాక, కినుక వహింపదగునా?

నార—సత్యాదేవీ! న న్నేల బతిమాలెదవు. కృష్ణుడు నీకు దాసుడు కదా నీ వెటు సేయుమన్న నటు లొనర్చుఁగదా. నీ కాచింత యేటికి. సర్వము సత్యయను తేజముచే కృష్ణుడను నంధ కారము నశించుచుండ నీ కేమికొదువ? నీ కీ చింత యేల? మఱియొక వస్తువును దెచ్చి కృష్ణుని దూచెదవా! ఈసారి నీయుద్దేశ మేలకాదో చూతము. ప్రజలందఱు కృష్ణుడు సత్యభామాధీనుఁడుకాని భక్తాధీనుఁడు కాజాలఁడని వచింపు చుండ నీ విటు పలికెద వేమి?

సత్య—(నారదుని పాదము లంటి)

ఉ॥ మానికులాబ్ధిచంద్ర! యసమానము కేశవలీల; యొంచ న
జ్ఞానమునన్ గనంగొనని కారణమే నను నింత జేసె; నా
మానసమందు గర్వమను మానిగ్రహించితి శౌరి భక్తసం
త్రాణుఁడుకాని యింతులకు దాసుఁడుకాఁడని నేఁడు నెంతయున్॥

నార—సత్యారమణీ! యిప్పుడు న న్నేమి చేయుమనియెదవు?

సత్య—మీ యనుగ్రహమున్న ప్రాణేశ్వరునిఁ దూచగలను.

నార—పిచ్చి సత్యా!

మ॥ సురవిద్యాధర యక్షకిన్నరులు రక్షోభూత తారావళీ
వరజీమూతవిహంగగుహ్యకమృగవ్యాళాప్సరఃఖేచరా
సురభూవృక్షనభోగిరీ సలిలరాశుల్ గర్భమం దున్న శ్రీ
వరునిం దాసునఁజూప సాధ్యమె ధనవ్రాతంబులం గోమలీ!

సత్య—ఏమివలనఁ జూచవచ్చును.

నార—ఇంతీ! ఎవ్వని నీ హృదయమం గలక్ష్యభావమునఁ దిలకించితివో, యెవ్వని సామాన్యునివలెఁ దలంచి నోనాడితివో, యెవ్వని మాయా వినోదములు నీ దాక్షిణ్యఫలితములుగా నెంచితివో, అట్టి నీనాథుఁడు జగన్నాథుఁడు కానిసామాన్యుఁడు కాడు. ఆశ్రితావనుఁడు భక్తవత్సలబిరుదాంకితుండు అమ్మహనీయుని వశుజేయఁదలఁచిన నొక భక్తియే సాధించును గాని యీ యనురాగములు నీ విషయసుఖములు నీ తీయనగు మాటలు నీ లాలనలు నీ ప్రణయములు నిరర్థకములు. నీహృదయమందుఁ దదేకభక్తి నాలోచింపుము.

సీ॥ జలజలోచన! "భక్తి" సంగీతమునఁ గాక
కమలాక్షు వలపించు గాన మేది?
మానినీమణి! "భక్తి" మాధుర్యమునఁ గాక
మధువైరి రంజించు మధుర మేది?
లావణ్యవతి! "భక్తి" లాలనంబునఁ గాక
పరమేశు లాలించు ప్రణయ మేది?
మత్తకాశిని! "భక్తి" మహిమంబునం గాక
వైకుంఠు వశుఁజేయు వ్రతము నేది?
గీ॥ సకియ! వినుము "భక్తి" సంపదచేఁ గాక
హరిని జూచగల్గు నర్థ మేది?
పరగ వ్రత జపములు బహుళతపంబుల
భక్తిలేక శౌరిఁ బడయు నగునె?

సత్య— సంయమీశ్వరా! భక్తియున్న మాత్రంబున ధన మవసరము లేదా?

నార—అవును. భక్తజనుల కట్టి ధనముతో నిమిత్తమే లేదు.

సత్య—ఏమి నిడి తూచెదరు?

నార—భక్తిమహిమమున నొక తృణము వైచినను శౌరిని సులభసాధ్యుని జేయును.

సత్య—అట్టివా రీ లోకమునఁ గలరా?

జయం—ఆహా! సత్యాదేవీ! నీరీతి జంబుకాసందమునకు సరిపోయెను గదనమ్మా. నీకు సాధ్యమయిన నో జగమునకు సాధ్యమా? కానిచో జగమున కలభ్యమా? ఎంత వెఱ్ఱితలంపులమ్మా నీయవి.

సత్య—తెలియక యడిగిన తప్పేమిగలదు? మునీంద్రా? అట్టివా రెచ్చట గలరు?

నార—ఈ పురమునందే కలరు.

సత్య—వా రెవరో యెఱిఁగింపుఁడు. బతిమాలి పిలిపించెదను.

నార—నిజముగా బతిమాలుదువా?

సత్య—బతిమాలుటగాదు? నా తప్పుల క్షమింప వేడి తోడ్కొని వత్తును.

నార—సాత్రాజితీ దేవీ! సత్రాజిద్రాజేంద్రుని ముద్దు కూతురవై హరికిఁ బ్రియంపుసతివైన నీ వెవరినో బతిమాలుదువన్న నమ్మకమా?

సత్య—మునీంద్రా! గతజలసేతుబంధన మేల? అట్టివా రెవరైన సరియే పాదములపైఁ బడియైన తోడ్కొనివత్తును.

నార—నీ కేమియు కష్ట మనపింపదుగదా?

సత్య—సంతోషముగా నుందును.

నార—అట్లయిన నీసవతి యగు రుక్మిణి నెఱుంగుదువు గదా?

సత్య—(ఆలోచనతో) అవును.

నార—ఆమెవలనఁగాని యికార్యము నెరవేరఁజాలదు.

సత్య—(సంకోచమున) ఎగతాళిచేయుచుండిరా?

నార—నిజమును మాత్రమే వచించితిని.

సత్య—మునీంద్రా! నాథుని పరిణయమాడిన దాదినవతులన హేయభావమున మెలంగి మొన్న పారిజాతవృక్షప్రతిష్ఠనాడు సలువురయందును నామెను గేలిసేసి యేముఖమున నామతిహీనపుకార్యమును వినుపించి బతిమాలగలను? ఇంక నెవరైనఁ గలిగినఁ జెప్పుఁడు.

జయం—సమయము వచ్చినప్పుడు మూతి బిగించుకొనిన కార్యము నెరవేరునటమ్మా!

సత్య—జయంతా! నీ వేగి నా మాటలుగాఁ జెప్పి రుక్మిణీదేవిని నే విధముగానైనఁ దోడ్కొనిరమ్ము. నీకు వలయునంత ధనమొసంగెదను.

జయం—సత్యాదేవీ! నా వయస్యునకు నీవు ముద్దులభార్యవు; నీకాయన వలపుఁలప్రియుండు. కష్టసుఖముల ననుభవించుదానవు నీవే రుక్మిణిని బతిమాలిన న్యూనము వచ్చునని తలంచిన నాకెంత పట్టుదల యుండవచ్చును? ఉండగలిగిన ద్వారకానగరము. అంత నా వయస్యుని విడిచి యుండఁజాలక పోయితినా యీ ముని వెంట నీయనగారితో నేనును జంకకు జోలె తగిలించుకొని యేగువాఁడనే. నా కిదియేమి తప్పుగాదు గదా!

సత్య—(తనలో) అకటా! యిఁక నేమిచేయుదును. ప్రాణేశ్వరుండు మౌనము ధరించెను. తాపసియా, యవమానపథంబుఁ జూపుచుండెను. జయంతుఁడా మొత్తిపోకుపుమాట లాడుచుండెను. నా కీ సమయమున నిది దారియని చూపు ప్రియమిత్రులే లేక లోక మంతయు విరోధమయ్యెను. (ఆగి) ఇదినే చే జేతఁ జేసుకొనిన యవమానమే కాని యితరుల ననిన నేమిలాభము? ఈ యనుభవించినయనుభవముకన్న రుక్మిణిని బతిమాలుటచేత

హీనతఁ జెందుదునా. అభిమానమా! వెడలిపొమ్ము. గర్వమా! నీతావు జూచుకొనుము. హృదయమా! యిట్టిపను లెన్నటికి నొనర్పకుము.

(ప్రకాశముగా) నాథా ఇది మీకిష్టమా?

కృష్ణ—అది యంతయు సంయమి వచించినటులే.

సత్య—కానిమ్ము. ఎంతటి గౌరవభావము మీ ప్రియురాలియెడ నుంచితిరో యంతటి నైచ్యకార్యమును గూడ నేటికిఁ దల మీఁద నుంచితిరి అది మిమ్ముల ననవలసిన పనిలేదు.

గీ॥ పతియన నలక్ష్యభావంబుఁ ♦ బరపిచెప్పు
మాటల గ్రహింపకను నవ♦మానమైన
కార్యములఁ జేయుచుండు నే♦కాంతకైన
నిట్లొనర్పక సద్బుద్ధి ♦ యేలకలుగు!

(నిష్క్రమించును— తెరవ్రాలును.)

[తెర యెత్తగా రుక్మిణీదేవి మందిరము: కృష్ణునిపటము పూజింపుచున్న రుక్మిణీదేవి: పూజావిధానము ముగియుసరికి, సత్యభామ ప్రవేశించును.]

రుక్మి—(సత్యభామను జూచి)

ఉ॥ ఏలొకొ సత్య మైతొడవు ♦ లేమియుఁ దాల్పక నొంటిపాటునన్
సోలుచు చింతతోడఁ జను♦చుంటివి యెవ్వరికైన తప్పింప గో
పాలుఁడు క్షేమమేకద శు♦భంబె కదా భవదీయ కేళికి
క్లొల మనోపకారము గ్ర♦హించితివమ్మ! యెరుంగఁ జెప్పుమా.

సత్య—అక్కా! యేమని చెప్పుదును?

రుక్మి—చెల్లెలా! అట్లందు వేమి?

సత్య—అక్కా!

ఉ॥ చేసితి నొక్క కార్యమున ♦ చెడ్డ యటంచు గ్రహింపనేరకే
గాసిలిపాటుఁ జెందితిని

రుక్మి— ... ... ... ... కాంతుని కెగ్గొనరించినావా

సత్య— ... ... ... ... ... ... ... ... ... ... యా

రుక్మి—దోసము గాదటమ్మ

సత్య— ... ... ... మది దోచకపోయె నిజేశుదానముఁ జేసితి ... ... ...

రుక్మి—అయ్యో యెట్లు మనచేతను లొప్పెడు వా

సత్య— ... ... ... ... ... ... ... ... యొనర్చితిఁ.

రుక్మి— ... ... చెల్లెలా! యెంత మతిమాలినకార్య మొనర్చితి వమ్మా! చేజేత ప్రాణేశుని దాన మొసంగితివే! అయ్యో! మన కామహనీయుని పాదసేవాభాగ్య మింక లభింపఁజాలదు కాఁబోలు. ఎవరికి దాన మిచ్చితివి?

సత్య—నారదునకు.

రుక్మి—ఎట్టినియమములతో నోసంగితివి?

సత్య—అక్కా! ఆ నారదుఁడు వ్రతమునకుఁ బూర్వము నా గృహంబున కేతెంచిన యొక శుభ మైన వ్రతముఁ జెప్పుమని యడుగ నీ పుణ్యకవ్రతము నుపదేశించి పారిజాతముతో నాథుని దాన మీయవలయు నని వచించె. భర్తృ దానమునకు నేను సందేహింప భర్తయెత్తు ధనముగాని ధనేతరముగాని యిచ్చి మరల గ్రహింప వచ్చుననియె. అంతట నమ్మి వ్రత మొనరించితి నా గృహంబునఁ గల సకలధనకనకవస్తువుల నిడినను నాథుని దూచజాలక పోయెను. అంత ప్రాణేశ్వరుని నవరికియున నమ్ముకొనియెద నని బయలుదేరిపోవుచుండెను

రుక్మి—అకటా! చెల్లెలా, సత్యాదేవీ! యెంతపొరబడితివమ్మా!

గీ॥ అరయఁగ, బిపీలికాది బ్రహ్మాంతమగు ప్ర
పంచ మెల్లను గుక్షిలో నుంచియున్న

వారిని ధనములఁ దూచఁగా ♦ నరయుచెల్ల
కొండ వెండ్రుక బిగియించు ♦ కోర్కె కాదె॥

అతఁ డెవ రని తలంచితివి?

మ॥ సురలున్ సిద్ధులు ఖేచరాప్సరలు య♦క్షుల్ సాధ్యులున్ నాగకి
న్నరవిద్యాధరులున్ మునుల్ మదిని ♦ సన్మానింతు రెవ్వాని స
ద్గురుగా నెంచి యతండె ద్వాపరమునన్ ♦ గోపాలుఁ డయ్యెన్ నిశా
చరదాగ్జన్వ్యముఁ బాపనెంచి యదువం♦శంబందు సాత్రాజితీ!
ఇప్పు డానారదుఁ డెచ్చట నుండెను?

సత్య—అక్కా! నేను నాతప్పిదమును క్షమింప వేడుకొన నీవు వచించినటులే నారదముని చెప్పి భక్తిగలవా రొకతృణ మిడినను కృష్ణభగవానునిఁ దూచవచ్చుననియు నట్టి భక్తి నీయందుఁ గలదనియు తోడ్కొని రమ్మనియె.

రుక్మి—చెల్లెలా! నే నంతటిదాననా? నారదుఁ డెగ తాళిపలికెఁగాక!

సత్య—అక్కా! అట్లుగాదు. తప్పక యీకార్యము నీవలన నెఱవేరునని వచించె.

రుక్మి—అమ్మా! యెటు లయినను మనశక్తి విడిచి పెద్దల యాశీర్వాదఫలితముననైన గ్రహింపనగునేమో పోదము, పద.

(అని యొకతులసీదళము గైకొనును.)

సత్య—రమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు. తెరవాలును.)

[తెరయెత్తఁగా సత్యభామమందిరమునందు శ్రీకృష్ణ నారద జయంతు లుండె రుక్మిణీ సత్యభామ కుటిలలు ప్రవేశింతురు]

రుక్మి—నాథా! నమస్కారము.

కృష్ణ—ఇష్టసిద్ధి రస్తు.

రుక్మి—మునిచంద్రమా! అభివాదము.

నార—మనఃఫలప్రాప్తి రస్తు.

రుక్మి—బ్రాహ్మణశేఖరా! వందనములు.

జయం—అనుకున్నంత యద్యోరస్తు.

రుక్మి—మునీంద్రా? యీ సత్యాదేవిచే నను బిలిపిరేచిన కారణమేమి ?

నార—రుక్మిణీ! యీసత్యాదేవి యీకృష్ణుని నాకు దాన మొసంగె. మరల నీతని గ్రహించుటకు ధనముగాని, ధనేతరముగాని యీతనియెత్తు నిచ్చికొనవలసిన క్రమంబు గలదు. అది సత్యాదేవి కలభ్య మయ్యెను ఈమె నన్ను బలిమాల నీవలనఁ గాఁగలదేమో యనిచెప్పితిని.

రుక్మి—అటులయిన నే నిపుడు ప్రాణేశ్వరుని దూచవచ్చునా ?

నార—మంచిది. సత్యాదేవీ! యీకృష్ణు నెవరు తూచెదరో వారివశుఁ డగును. ఇందులకు నీ కిష్టమగునా ?

సత్య—ముమ్మాటికి నిష్టమే

జయం—మునీంద్రా! నను బోలిన వ్యక్తియొకఁడు పేలపిండి దినుచుండ నవ్వగా నది గాలికి పోయినదఁట. అంత నా జ్ఞాని పోయినది కృష్ణార్పణ మనెనఁట. ఆమాదిరిగా నిప్పు డీక సత్యాదేవి యెన్ని చెప్పినను సరియని పలుకుచునేయుండును.

నార—రుక్మిణీతరుణీమణీ! యిఁక నీ ప్రయత్నము కొనసాగింపుము. కృష్ణా! నీ వీ త్రాసునఁ గూర్చుండుము.

కృష్ణ—(త్రాసునఁ గూర్చుండును)

రుక్మి—సత్యాదేవీ! యీధనధనేతరముల నన్నిఁటిని దీయించి వెలుపల నుంచుము.

సత్య—జయంతా! కుటిలా! మీ రా ధనధనేతరములఁ దీయుఁడు!

జయం—కుటి—(ఆవిధముగ నొనర్తురు)

రుక్మి—(కృష్ణునకుఁ బ్రదక్షిణముగా ముమ్మారు తిరిగి కూర్చుండి పాదములంటి) మహాత్మా! పురాణపురుషా! వేదస్వరూపా! దేవకీనందనా!

సీ॥ నీ లీలచేఁ గదా ♦ నిఖిలప్రపంచంబు
జన్మకారణగతుల్ ♦ జరుగుచుండు
నీప్రేమచేఁ గదా ♦ యీప్రపంచం బెల్ల
దినదినవృద్ధిచేఁ ♦ దేజరిల్లు
నీ కోర్కెచేఁ గదా ♦ నిఖిలజీవవ్యాపా
రాలు కర్మములయి ♦ మెందుచుండు
నీమాయచేఁ గదా ♦ భూమినభస్సార
కాంభోధు లిల నుండ ♦ నయ్యె మిగుల
నీవిలోకనమే గదా ♦ నిమిషనిమిష
మునకు నొక్కొక గతిసౌఖ్య ♦ ములును కష్ట
ములను గైసేసి భ్రమతను ♦ గొలుపుచుండు
భక్తవత్సలబిరుదాంక! ♦ భవవినాశ!

గీ॥ నీదుచరితంబులు సురమా ♦ నీందుల్రలకును
ధాతకును శైలతనయసం ♦ధాతకును న
లభ్య మందుఁ యువతిని నేఁ ♦ర్వంగనోప
నన్ను మన్నించి ప్రోవు మా ♦పన్నరక్ష!

కృష్ణు—యువతీ! నీపని నెరవేర్చుము.

రుక్మి—(లేచి యంజలి ఘటించి.)

ఉ॥ శ్రీతరుణీమనోహరుని శేష ♦ శయానుని పాదపంకజ
ద్యోతకమందు నామనసు ♦ దూలునయేని సదామనోహర
శ్రీతరకేళి కన్యమును ♦ జింతనఁజేసి మెఱుంగనేని నేఁ
డీ తులసీదళంబు హరి ♦ నిం దులఁదూఁచెడు గాత భక్తిమై.

(తులసీదళము త్రాసునకైవ కృష్ణునికై పు పైకిలేచును పుష్పవృష్టి కురియును)

నార—సత్యాదేవీ! యిప్పటికైన నీ యజ్ఞానము విడిపోయెనా శౌరి
భక్తజనవశ్యుండు కాని స్త్రీలోలుఁడు కాడని యెఱింగితివా?
ఇంక నొక్క విషయము జెప్పఁదలఁచితిని.

క॥ ఈమెయె శ్రీలలనామణి
యీమహనీయుండె హరి ధరిత్రీభరముల్
నేమమునఁ దీర్పఁగా బల
రామానుజుఁడై జనించి రమ్మ ధరిత్రిన్.

సత్య—మునీంద్రా! మీకృపవలన నాయజ్ఞానంబు విడిపోయె ప్రాణేశ్వరుని భక్తవాత్సల్యంబు నాకుఁ గాక ప్రపంచ మంతటికిని విశదం బయ్యె. ప్రాణేశ్వరా!

క॥ ఈ విట్టి వాఁడ వనుచును
భావింపక మోహమున నపకృతిని నీకున్
గావించితి నింకను నీ
సేవాభాగ్యంబు దయ సేయవె కృపతోన్.

కృష్ణు—సత్యా దేవీ! నీ వొనర్చిన యపచార మేమియును లేదు. చింత నందకుము.

చ॥ పతిమునకు లేకన్నె వలలఁ ఒన్నతి రందమని గర్వభంగముల్
మతిఁ దలఁచి బోకుమవమా నముగా దది నీకు శ్రేయసో
న్నతియె లలనా రత్నములకల్వను సానల దీరకున్నచో
ద్యుతి గలదే మణుల్ భూమణిముకొప్పనిచో లునఁ గుట్టఁజూతురే.

రుక్మిణీ! నీకుఁ గావలసిన వదుగుము.

రుక్మి—ప్రాణేశ్వరా! జగత్కారణులగు మీ కృపావిశేషము కన్న నా కేమికోరికలును లేవు. అయిన నిట్లగుఁగాక!

మ॥ ప్రాణేశుం డన దీర్ఘభక్తయుతయై భద్రాత్మయై తత్పదా
ధీనప్రాభవయై యనూనమతియై దివ్యానుభూతాదివి
జ్ఞానానందమయప్రవీణమణియై కామ్యార్థిప్రార్థ్యయై
మానారాయణ! రుక్మిణీసతి ధరింపన్ గాత నీ సేవలన్.

కృష్ణు—తథాస్తు. నీకుఁ గావలసిన దడుగుము.

సత్య—మహాత్మా! నా కొక కోరిక కలదు.

మ. పతియేదేవునిరూప మంచు మదిలో • భావింపఁగా నోప కీ
గతి ప్రాణేశుని నింద్యకార్యముల జోకఁ దెల్చి యుప్పొంగునే
సతియైనన్ ఇటువంటిభంగము లమేయం బంది దారిద్ర్యమై
పతితస్థానము నందుచుండ వరమున్ • బ్రార్థింతు నీయంగదే.

కృష్ణు—తథాఽస్తు- జయంతా! నీవేమికోరెదవు

జయం—శ్రీరమానాయకా! నా కొక ప్రీతి కలదు.

గీ॥ పరమమునులకు నెల్ల నం • భ్రమము లేది
ఆదిమధ్యాంతరముల శూన్యంబు లేది
యట్టి నీమూర్తికిని చెలికాడ నగుచు
జన్మజన్మను జనియింప • జాలు నీవె.

కృష్ణు—తథాఽస్తు. నారదా! నీ కేమైనఁ గోరికెలు కలవా?

నార—నందనందనా! నీ సేవకన్న నాకుఁ గావలసిన దేదియులేదు.
అయిన నిట్లగుఁగాక!

ఉ॥ ఇంతులు భర్తలన్ బ్రియము • లేర్పడఁ జూచుచు నెల్లవేళలన్
నింతురుగాత సేవల నహీనసుఖం బొనగూడునట్లు ప్రే
మింతురుగాత భర్తలు రమేశ! సదా జగమందు భక్తుల
త్యంతము నీదుప్రేమల • ధరన్ విహరింతురుగాక భక్తినిన్.

కృష్ణు—తథాఽస్తు.

---

గద్య:

ఇది శ్రీవేదశైల లక్ష్మీనృసింహ కరుణా కటాక్ష వీక్షణ లబ్ధకవితా
మధుర భాగధేయ సూరిజనవిధేయ యేలెశ్వ వెంకటసుబ్బయ
నామధేయ ప్రణీతంబైన సాత్రాజితీ గర్వభంగమున
పంచమాంకము

సర్వము సంపూర్ణము. శ్రీ. శ్రీ శ్రీ.

---